





# శతకాలు

## భక్తి,జ్ఞాన,నీతి

# నారాయణ దాస పంచ శతి





## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120001097

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఒజసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

దాసభారతీ ప్రచురణలు : ౧౨

నారాయణదాస

# పంచశతి

[దాసుగారి తెలుగు శతకములు]

కృతికర్త :

మహాకవి

శ్రీ ఆదిభట్ల నారాయణదాసు

సంపాదకుడు :

శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులు

ప్రచురణ :

రామక్రిష్ణా ఇండస్ట్రీస్ వారి సౌజన్యముతో

# ముద్రాపక ప్రశస్తి

శా। శ్రీ లొప్పారి మహాంధ్రదేశమున వాసింజెంది, సాహిత్య కే
ళీ లోలత్వమునంది, సౌహృదము నోలింబెంచి, విద్వన్మనో
బ్జాలంకారత సంఘటించి, సుకవీంద్రానేక కావ్యాళి మా
లా లక్ష్మీక్రముడై చెలంగెడిని మేల్కర్పూర సౌరభ్యముల్

శా। ఆ సౌరభ్యము రూపమై వెలసెనో? అ సౌహృదమ్మెల్లపెన్
మూసంబోసిన మూర్తి వైభవమొ? సొంపుల్ నింపు సాహిత్య కే
ళీ సౌభాగ్యమొ? రామచంద్ర కరుణాలీలా విశేషమ్మొ! పే
ర్వాసిన్ గప్పురపుం బసందు రుచిమత్ప్రారంభ మేపారెనో?

సీ। శ్రీరామ చరణ రాజీవ సద్భక్తుఁడై
పరమ పావనధర్మ ఫక్కి నెఱిఁగి
పృథు యజ్ఞశీల పవిత్ర చరిత్రుఁడై
పుణ్యవాసనల పెంపునఁదనర్చి
కేశవతీర్థ సంకీర్తిత శ్రీరామ
చరితముద్రణ ధురంధురతఁదాల్చి
రామనామధ్యాన రసవన్మనోవృత్తి
సకల సజ్జనమైత్రి సంతరించి

గీ। మహిత సీతాసతీ మనో మధురమూర్తి
రాముఁడై కృష్ణవైభవారాముఁడగుచు
పరిమలద్దివ్య కర్పూర వంశజలధి
చంద్రముఁడు రామకృష్ణాంకు సాధుశీలి

శ్రీ నారాయణ దాస పంచశతి ముద్రింపించి దాతృత్వ దీ
క్షా నైపుణ్యము మెచ్చ కోర్గానెడి శ్రీ కర్పూర వంశోద్భవున్
శ్రీనిండారెడు భోగభాగ్యములతోఁ జెన్నారు శశ్వత్కలా
శ్రేణి ప్రాణముగాఁగఁ బ్రోచు హరి మా శ్రీరామకృష్ణాగ్రణిన్

పూర్వ జన్మార్జితమ్మైన పుణ్యమెల్ల
నమల కర్పూర పరిమళమై తనర్ప
సుకవి విద్వత్కలారాధనకు సతమ్ము
నొప్పఁగావుత ధనము పరోపకృతిగ

శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులు

— ౦ —

శ్రీః

# దాస దర్శనము

ప్రపంచమున సారస్వత రేఖ నిత్యనూతనము నిరంతరమునై పల్లవించుట రసజ్ఞలోక మెఱుఁగనిదికాదు. ఆసారస్వతము బహురూప మయ్యు సంగీత సాహిత్యాత్మకమగుట సర్వ విదితము.

"సంగీత మథ సాహిత్యం సరస్వత్యా స్తనద్వయమ్
ఏక మాపాత మధుర మన్యదాలోచనా మృతమ్"

అను నభియుక్తోక్తికి సంపూర్ణ లక్ష్యములైనవారు జయదేవ నారాయణ తీర్థ ప్రభృతులు. సామగాన ప్రియుడగు పరమాత్మ సాన్నిధ్యము వారికి లభించినంత సులభముగా శీఘ్రముగా నితరులకు లభింపదు. అట్టి వారిని విజ్ఞాన పూర్ణులనియు పూర్ణ పురుషులని పెద్దలు వ్యవహరించుట కద్దు. శ్రీమదజ్జాడాది భట్ల నారాయణ దాసుగారు మహా పూర్ణపురుషుడు. కేవల సంగీత సాహిత్యములే కాక కథా గాన నృత్య కవిత్వాది నానా రసవత్కలా నిధానమైన వారగుట పుంభావ సరస్వతి యనుటయు నతి శయోక్తి కాదు. శాస్త్ర సంపత్తి వానికన్నింటికి జీవభూతమైనది. అన్నింటికంటె వారి యౌదార్యము భిరక్తి సర్వత్ర గోచరించును. ఆవారి సర్వవిజ్ఞాన విధానమున కీ పంచశతి ఒక విశిష్ట మణి దీపిక.

సాధారణముగా సంస్కృతాంధ్ర కవులు శతకముల నత్యాధికముగా నాదరింతురు. ఈ యాదరణమునకు హేతువులను పెక్కురు పెక్కు విధములుగా నూహించిరి. కావ్యరచనా యోగ్యతకై యిష్ట దైవ ప్రార్థనాత్మకమైన ఒక అభ్యాసమని చాలమంది యభిప్రాయము. అది త్రోసి రా జనరానది. ఈశతకములు మాత్ర మట్టివికావు. వీని ప్రత్యేకత విలక్షణముగా గోచరించును. నారాయణదాస వ్యక్తిత్వము నెఱిగిన వారెవ్వరైనను అభ్యాస మాత్రమనలేరు. ఆయన సహజ

పాండిత్య ప్రజ్ఞాప్రాభవోపేతుడు. తొలి మలి పద్యములు ఓకే సమయ మున వ్రాయబడినట్లుండుట వీరి సర్వప్రత్యేకతకు పరమోదాహృతి. వీరి పద్ధతి యొక్కటి స్థిరమైనది. పద్యముగాని పాటగాని మాటగాని వ్రాసినదానిని మరల మరల జూచి హెచ్చు లొచ్చులను సరిచేయునల వాటులేదు. మహారణ్యభూమి వలెనే, నిమ్నోన్నతములతో సహజ ప్రకృతివలెనే వీరికవిత్వము శోభిల్లు చుండును, కృత్రిమత యనునది వీరికి బొత్తిగా నచ్చనిది. సర్వ ప్రపంచ విషయములు వీరి బుద్ధికి గోచ రించును. సాంప్రదాయికములు వీరికి నచ్చనిచో నిర్భయముగా నా విషయము నుద్ఘాటింతురు. సహేతుకముగ నిర్ధారింతురు.

మహాకవులు కొందరు శతక రచనలు చేయుటలో తాత్పర్య మేమియా యని యాలోచించినచో స్వార్థబుద్ధికంటెను పరార్థబుద్ధియే స్పష్టమగును. తా మేదైవముయొక్క కృపకు పాత్రులై కలిగిన బాధ లను నివారించుకొన్నారో అట్టి బాధ లెవ్వరికినేని కలిగిన నా స్తుతులచే నాదైవతములు ఆవారి బాధలు తీర్చునుగదా! లోకమున కుపకరించు నన్న మేలియూహాయే ఈ శతకరచనకు కారణము. చూడగా మూక పంచశతి యిట్టిదేకదా? తత్పారాయణముచే బుద్ధిహీను లెందరెందరో మహాకవులగుట లోకమెరుగునుగదా! అట్టి మహిమగల శతక సంపుటేయీ పంచశతి.

ఇందు సూర్యనారాయణ శతకము మొదటిది. సూర్యనారా యణుడు ప్రత్యక్షదైవము. లోకమునకు ఆరోగ్యప్రదాత. నారాయణ దాసులో వట్టి నారాయణుడుకాడు. సూర్యనారాయణుడు. ఇన్ని సంబంధములతో ఈశతకము సాగినది.

"ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్ శ్రియమిచ్ఛేద్ధుతాశనాత్
ఐశ్వర్య మీశ్వరాదిచ్ఛేత్ మోక్షమిచ్ఛేజ్జనార్దనాత్

అను సభియుక్తోక్తి ప్రకారము సూర్యభగవానుని వలన నారో గ్యము నొందుట మయూరాది మహాకవుల చరిత్రలు తెలుపుచున్నవి.

ఈ మహాకవి కేవలమారోగ్యమేకాక ఆరోగ్యాది మోక్షపర్యంతము సూర్యభగవానునే ఉపాసింపవలెనని తన సిద్ధాంతము స్పష్టపఱచినారు. సూర్యదేవుని నవరసమూర్తిగా చిత్రించుట మాత్రము ఈ మహాకవికే చెల్లినది.

"కమలాళిన్ వికసింపఁజేయునెడ శృంగారంబు, హాస్యంబు దు
ర్దమ మందేహ తమిస్రమారణమునన్, రౌద్రాద్భుతో ద్వీర సం
క్రమ బీభత్స భయానకంబులు లసత్కారుణ్యముం దావకీ
నమహాభక్తులయందు, నస్తగిరి పొంతన్ శాంతభావంబు నీ
వమరంజేయుదు నిత్యనిర్గుణుడవై హా ! సూర్యనారాయణా !"

ఇది దాసుగారి పద్ధతి. ఆయనబుద్ధికి అగమ్యములేదు. లోకము నందలి సర్వపదార్థములను మేధావి లోకోత్తరముగా సర్ది యనుభవించవలెను. ఆమేధ వీరికి వలసినదంతయున్నది.

ఈ మహాకవి సర్వమతసిద్ధాంత సారసర్వస్వగ్రహణ పారీణత అబ్బురముగొల్పును.

"సరిగాబౌద్ధులు విన్నభావముగ. హంసల్ సత్తుగా, దార్కికుల్
పరమాణుస్థితిగా, బహుప్రకృతిగా, బల్మారు సాంఖ్యుల్ సదా
ధర మీమాంసకులెల్ల గమ్మగ : బరంధా ముమ్మగా యోగులం
దురు, నేనో మఱినీవే సర్వమని యందున్ సూర్యనారాయణా !"

దీనికిమూలము ప్రసిద్ధమైన శ్లోకమున్నది. నేనో మఱినీవె సర్వమని యందున్ అనుట శ్రీ నారాయణదాసవ్యక్తిత్వము.

దాస నిశ్చయమిది

నీ దాసుండగు వానికాపదలురానేరా, వొకప్పట్టినన్
సూదిన్నీళులు నిల్వనట్లు పడినెంతో దూరమైపోవు, త్వ
త్పాదాంభోరుహచింత నౌషధము తప్పన్ లేదు పాయఁబువే
రేదైనన్ భవరోగమూడ్చుటకుఁ దంద్రీ ! సూర్యనారాయణా !

ఐహికాముష్మిక సౌఖ్యదాతృత్వము సూర్యభగవానుని ధర్మ మనిగదా వీరినిశ్చయము. వారి భక్తితత్పరతకిది పరమ దృష్టాంతము.

"ఊహాపోహల శాస్త్రశోధనములన్ యుక్తుల్ క్రతుస్నానముల్
సోహమ్మంచువచించుటల్" వృథయ, సత్యంబున్ దయన్ గల్గియు
శ్రీహర్షింబొప్పగ భక్తితో భవదుదంచన్నామ సంకీర్తనం
బాహా సేయక మోక్షమబ్బుటెటులయ్యా! సూర్యనారాయణా!"

నిరంతర భగవన్నామ సంకీర్తనముకంటె మోక్షమునకు సాధనమింకొకటి లేనేలేదని వారి విశ్వాసమును పలుబమ్ముఖముల చిత్రించి తెల్పినారు. నవ విధ భక్తులలోనిదగు సంకీర్తనభక్తి ముఖ్య భక్తిగా తానుస్వీకరింపలేదు. ఈ గ్రంథోపసంహారమును తిలకింపుడు.

"ఆరయంగా సకలశ్రుతిస్మృతి పురాణాద్యర్థ సారంబుల
న్మైబ నాశక్తి కొలందిచూచి తుదకమ్మైత్రి యోధింగ్రై కోటి సం
పరిణామోద్ధరింపఁ జేయుటకు యుష్మద్భక్తి దక్కన్య మీ
నరలోకంబున లేదుపాయమని యన్నా! సూర్యనారాయణా!

ఇదివారి నిశ్చయము. సకలశ్రుతిస్మృతి పురాణాదులను మథించిన వినూత్న విచిత్ర విశేష విజ్ఞానముతో మథింపగా నవనీతమువోలె వెలువడిన పరమ సిద్ధాంతము భక్తి. ఆభక్తి నవవిధములు గావున సంకీర్తన పరమమోక్షసాధనము.

"మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవగరీయసీ" అనియు
"భక్తిరేవైనం గమయతి, భక్తివశః పురుషః" అనియు

శ్రుతిస్మృతులు చెప్పుచున్నవిగదా! శ్రీమద్భాగవతాదులు ఈ విషయమునే ఉద్ఘాటించుచున్నవి గావున శ్రీదాస భక్తి సిద్ధాంతమున శాస్త్రీయము సర్వజన సంసారసంతరణ సదుపాయమనుటలో సందేహము లేదు.

ఇక్కడి ఇందలి పద్యములన్నియు వినూత్నచిత్ర మహావిషయ ప్రతిపాదకములగుటయేగాక సహజసుందరములు నగుట శ్రీదాస ప్రతిభకు

అపార వ్యుత్పత్తికి పరమ దృష్టాంతములు. అన్ని పద్యములు ప్రథమోదాహరణార్హములే గావునను, సిరవకాశము నెత్తిపై త్రొక్కుట చేతను ఈగ్రంథ ప్రస్తావన నింతటి విరమింపవలసెను.

ఇక రెండవది మృత్యుంజయము. అనగా నిది నిజమైన మృత్యుంజయమే ! సంజ్ఞా మాత్రముగాదు.

మృత్యుంజయుడు పరమశివుడేగదా ? మరల నామధేయమున శివ పద ఘటనమేల ? దాసభారతి నిర్విశేషముగ దొరలివచ్చుననుటకు నామనసొప్పదు, — కావున మొదటి మృత్యుంజయ పదము విశేషణము. ప్రాణాపాయకరవ్యాధిలో నుండగా శ్రీదాసభారతి పరమశివుని స్తుతించినది. అది మృత్యుంజయమైనది. ఈ శతకమును ఎవ్వరు పఠించినను వారెల్ల రపమృత్యుంజేతలగుదురు, కేవల మృత్యుంజయమే కాదు శివముకావలయు. కావుననే నామధేయము మృత్యుంజయము. సంబోధన, జగన్మంగళాత్మకమైన శివనామము సెబాసు !

తొలిపద్యమున సూర్యనారాయణ శతకమునకు వలెనే శ్రీకారాదులులేవు. శ్రీకారాదిగా కావ్యప్రారంభము అనునది సామాన్యము. కాని మహార్తి పూర్ణమగు హృదయముతో స్వామిసన్నిధికి పరువెత్తు దాసభక్తి పరమవిశిష్టముగా సంబోధించినది.

"ఓనాథ దీనరక్షక మానుగమముగావుమా !" మొదలు నూరవది యగు "శివ శివ శివ మృత్యుంజయ ! భవ భవ భవ పాపదూర భక్తాధారా !" వరకు ఏకరూపముగా పరమార్తి బంధురముగా ఇష్టదైవస్తుతి విషయికమైన రతి సాగినది. ఇట్లు సాగుట మహాకవి లక్షణము. లౌకికములగు కామక్రోధాదుల కతీతమైనపుడుగాని ఏవంవిధ మహానిష్ఠ కుదురదు. శాస్త్రవ్యుత్పత్తిగల మహాకవులు శాస్త్రీయ సంప్రదాయము లెట్లు నిక్షేపింతురో ఈ పద్యమునందు గోచరించును. పూర్వార్ధమునందు శివ శివ పదములు నావృత్తము చేయుట. ఈయా

వృత్తి పరిసమాప్తిస్తోత్రకము. ఇంతకంటె చేయవలసిన స్తుతిలేదనుట. ఈ స్తుతియు పరిసమాప్తమైనదనుట. ఇట్టి చమత్కారములు దాస కవితా వాహినిలో కోకొల్లలు దొరలివచ్చును.

ఈ మృత్యుంజయము వారి సోదరులకు వ్యాధి సంక్రమింపగా వైద్యు లసాధ్యమనగా బంధువులు బిక్కమొగములు పెట్టగా నాడీ సంచలన మపమార్గము పట్టగా నారాయణదాస మహాభక్తి ఈ శత కౌషధి సంజీవనీ మహామహిమచే సోదరుని పునరుజ్జీవితుని చేసుకొన్నది. దాసానుభూతియట్టిది.

ఒకపర్యాయము దాసుగారు బందరులో హరికథ చెప్పుటకు వెళ్ళినారట! అపుడు శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారితల్లి నాయనా! మబ్బుపట్టినది వానవచ్చిన కథ యెట్లు జరుగునో ! అనగా నారాయణ దాసుగారి కథగావున వర్షము రాదమ్మా ! అన్నారట ! వర్షములేదు. కథ లోకోత్తరముగా సాగినది. ఈ విషయమును శ్రీసత్యనారాయణ గారు వారేచెప్పగా మఱికొందరు పెద్దలతో గలిసి విన్నాను దాసభక్తి మహిమయట్టిది.

నిష్కృష్టము పవిత్రమగు నాభక్తిభావము ఈ శతకములో రూపుగట్టి ప్రవహించినదనుట సహజోక్తియేగాని మెచ్చుగాదు. ఈ శతకమెల్ల తనజోడు కవపాటకాడునైన సోదరుని రోగబాధ నివా రణకై దాసహృదయము పడెడి ఆరాటము నూరుపద్యములలోను సాక్షాత్కరించును "క్రియాసిద్ధిస్సత్త్వేభవతి మహతాం." అన్నసూక్తి కింతకంటె లక్ష్యమేమి కావలెను ? ఇందలి పద్యములన్నియు మారేడు దళములవలెనే భాసించును. ప్రతిపద్యము విస్తృత వ్యాఖ్యానార్హము. వివరణము మొదలిడినచో మూల గ్రంథమునకంటె ద్విగుణముగా భారమగును. అన్నిపద్యములును శివమూర్తులే! ఏదేనినేని హెచ్చు లొచ్చులనలేము. అది దాస ప్రతిభ.

"ఇది బిరుదు నీదు భక్తుల
సదయత రక్షించినావు శంకరుఁడవుగా
పదునాల్గు భువనములలోఁ
బడపడి చాటుదునిఁకన్న బ్రదికించు శివా!"

చిత్రము! భక్తులను రక్షించుట పరమశివుని బిరుదు. అనగా అలంకారము. సేవ్యుల కింతకంటె ధర్మమేమున్నది? అలంకారమేమున్నది? దీని పదునాల్గుభువనములలో చాటుశక్తి మాత్రము ఒక్క నారాయణదాస మహాకవికే గలదు. ఇది వినిమయము. రక్షణమొకరివంతు, దానిని ప్రచారము చేయుట యొకరివంతు వీరిద్దరు నసాధారణులు. సేవ్యసేవకభావము ఇట్లుండవలెగదా!

చివర కొక్క సత్యమును చెప్పుచున్నారు దాసుగారు.

"సత్యము నీదగురక్షణ
సత్యము నీభక్తులెల్ల సౌఖ్యముఁ గొంటల్
సత్యం బీశతకంబవి
సత్యత నాయన్నఁ బ్రోవు సర్వేశ శివా!"

ఈ శతకము సత్యమనగా శతకాను సంధాతలకు మహాఫలము మృత్యుంజయాత్మకము తప్పక సిద్ధించునని పరమ ఋషివలెనే పుణ్యమును అందరకును పంచిపెట్టెడి ఔదార్యము దాసుగారిది.

మూఁడవది ముకుందశతకము.

ఈశతకారంభమున సత్యనారాయణ స్తవమున్నది. ప్రతి పద్యమునను నారాయణ శబ్దమున్నది. మకుటము మాత్రము ముకుందయని. భగవత్తత్త్వమేకరూపమైనను మూర్తులు తత్ప్రతిపాదక మంత్రములు భిన్నములుగావున మూర్తి భేదము నంగీకరింప వలెను. తాత్పర్యము సత్యనారాయణ శతకమేయయ్యును కందపద్యాంతమున నాగణము అమకదుగావున మోక్షప్రతిపాదకతాద్యోతకమగు ముకుంద శబ్దమును సవిశేషణముగా మకుటీకరించి తమ తాత్త్వికతను స్పష్టము చేసినారు.

మొదలి శార్దూలముగాక సరిగా నూరు పద్యములు. అందరును తరించుటకే కందములు వ్రాసినట్లు రచన ఫలమును పరబ్రహ్మసాక్షికముగా పాఠకులకు ధారవోసినారు. బిందు పూర్వక దకారప్రాసతోడి పద్యము చివర కూడ బిందు పూర్వకద కారముతో నాగుట పద్యమున కొక అందము వచ్చును. ఇది కేవల శాబ్దికమే యయ్యును అప్రయత్న సిద్ధముగావున వాక్యార్థాపకర్షకము కాకపోవుట చేతను అధమము మాత్రము కాదు.

ఈ ముకుందశతకము కుందప్రసూన గుచ్ఛము వలెనే గుబాళించు చున్నది. విరజాజి పొట్లమువలె పరిమళించు చున్నది. ఇందం దెందైనను సుఖంబంద భక్తియే యుపాయమని మదికి విందుగా రోగ ములకు మందుగా భక్తిని భావించి తరించిన మహాభక్తియోగి దాసు గారు.

"మందరధర! రారా! శ్రిత
మందారా! రార! పాపమర్దనరా! గో
విందా! రా! నారాయణ
కందళితానంద మూల కంద ముకుందా!"

ఆటలు మరగిన బాలకృష్ణుని బ్రతిమాలుచు పిలుచు యశోదా దేవి ఆరటము ఆప్యాయము ఆహ్లాదము ఈపద్యమున నాలుగు వైపుల జూచుచు పిలుచుటలు తోచుచున్నవి.

హారవిలాసమున చిరు తొండనంబి కథలో సిరియాళుని వండిన పిమ్మట పరమశివుడు పిలువుమనగా తల్లి గద్గదసదద్గళముతో "రారా షణ్ముఖాంశ వారాశి హిమధామ" అని దిక్కులుచూచి పిలిచినది. తత్ద్వ్యంజన పాకగంధిలములైన అవయవములతో వచ్చినాడు. అట్టి పద్య మరుదుగా గాన్పించు చున్నది. నే సరువది నాలుగు లఘువులలో నారాయణునే పిలువగా నీకంత సీసపద్యము కావలెనా అని శ్రీనాథుని వెట కారమాడు చున్నట్లున్నది. ఇద్దరు సార్వభౌములే. గావున ఒకరి

నొకరు సరసములాడు కొనుట దోసగుగాదు. ఆసార్వభౌమునకు మీస లున్నట్లు నేనెఱుగను.

ఈ మహాకవి ప్రాసలను గాని ఉపమలను గాని ఉత్ప్రేక్షలను గాని అందుకొన్నచో బండ్ల నుండి గ్రుమ్మరించినట్లేగాని మహామేఘము వర్షించినట్లేగాని వేఱుగాదు. ఆసేతు శీతాచలము తిరిగితిరిగి అన్ని సారస్వత ప్రక్రియలందును ప్రథమతాంబూల మందు కొన్నవారే. పండ్లికిలించి చిత్తమనుట వారెరుగని విద్య. సహృదయ మిత్రుల యెడల, నిగర్వులు నిరాడంబరులను నగు విద్వాంసుల యెడల వారుచూపెడి అపారగౌరవము అనన్యసామాన్యము, నాన్యతో దర్శనీయమును. ఒకటి రెండు పద్యములకే ప్రాసలందక గ్రుడ్లు మిటకరించి ప్రాసలే మార్చుకొనెడి నేటి చాలమంది కవుల కీశతకము పరమాశ్చర్యమును కలిగించుటలో వింతలేదు. ఇన్ని ప్రాసలును చమత్కారజనకములై సహృదయ విస్మయమునే గొలుపునుగాని వచ్చినవే వచ్చుచున్నవని అసంతుష్టినీయవు.

అన్ని పద్యముల వెనుకనుండి పురాణగాథలు తొంగిచూచును. **ఉదా.**

"బందెలిడెద సమ నెదనిదె
పందెము నీకంటె మొండివాడనురా। గో
విందుండా। నారాయణ।
కందళితానంద మూల కంద ముకుందా।

హృదయమున భగవంతుని బంధించుట యోగులచేతనైనదే గాని మానవులకు గాదు. ముకుందుని హృదయమున బంధింతునన్న మాట సంయమిత్వ ద్యోతకము. గోవిందుండా! అని సంబోధించుట మరింత విశేషము. ముకుందున కాసంబోధన మిష్టము.

గోవిందేతి యదాఽఽక్రందత్ కృష్ణా మాం దూరవాసినమ్
ఋణం ప్రవృద్ధ మివమే హృదయాన్నాపరస్పతి"

ద్రౌపది గోవిందా! యని పిలిచిన ఆ కేక ముకుందుని చెవులబడి అర్ధమన్నని గావించినదట! దీనికి తిక్కన "ఈగగరాని అప్పు" అని తెనిగించినాడు. అట్లే ఈ గోవింద పదముకూడ గోశబ్దాభిధేయార్థముల నన్నింటిని ఆవృత్తిచేయుచు అద్భుతార్థము నొసగుచున్నది. స్వామి దర్శన మిచ్చినను పోల్చుకొనలేక మఱపుచెందుట ప్రకృతిసహజమైన సత్యము. భగవత్తత్త్వము నెఱిగిన వారికందరికిని ప్రపంచ మసత్య మనియే తెలియునట! గర్వనిరాసము భూతదయాభివృద్ధి వారికి పరమ సమ్మతములు. ఆయుశ్శేషమంతయు భగవద్గుణసంకీర్తనమునకే విని యోగింపజేయవలయునట! ఇది భాగవతధర్మము. ఇదిగో!

"నీపాదకమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యమ్ము నితాం
తాపార భూతదయయును
దాపసమందార నాకుదయసేయఁగదే!"

దాసబుద్ధియు దాసకవిత్వము నీజాతివి. వారి కోరికచూడుడు! ఎందైనను మిత్రులకందరకును భగవద్భక్తినందింపుమని కాళిందీప్రియుని కోరుచున్నారు. ఈ శతకము వ్రాసి భగవదంకితము చేసి దాస హృదయము పొందిన యానందమునకు మేరలేదట! ఇది సత్యము: సదానందమును ఇంకేలు వ్రాసి చిట్టచివర

అందఱు దరియించుటకే
కందము లాచంద్రతారకంబుగ మహిలో
నందెఱపుము నారాయణ!
కందలితానంద మూలకంద! ముకుందా!

ఇది సర్వ ప్రపంచ సంసార సంతరణ వాంఛ. పరమ హంసలకు మాత్రము చెల్లినది. వీరికడ చెల్లినది.

వీరు అంతరంగిక వైరాగ్య సంపత్తి కలవారు. ఆశ్రమ స్వీకారము లేని పరమహంసలని నాతాత్పర్యము. ఈ శతకమెల్ల హృదయముతో

చదివిన నీయర్థము తెల్లమగును. ప్రతి పద్యము నారాయణ శబ్దాంకితము. మకుటము శబ్దార్థవివరణము చేయుచున్నది.

ఆనంద కందము నారాయణుడే గదా! మిగిలిన యానందములు నిత్యములు గావు. అనిత్యములైన వాని ఆనందములుగా వేదాంతులొప్పరు. కావున పరమహంస సంస్మరణార్హమగు నారాయణ శబ్దమును పద్యాంతమున నిక్షేపింపక పద్యగర్భమున నిమిడ్చినారు. ఇది వారి ఆంతరంగిక నారాయణ పరాయణతను అర్థతః ధ్వనింపచేయుచున్నది. ఇది కావ్యభాషలో ఒక విధమైన శిల్పరచన.

నాల్గవది వేల్పువంద. ఈ వంద పద్యములును గండశిలల వంటి సీస పద్యములు. ఈ వంద పద్యముల కర్థము తడవులాడక చెప్పుట ఎంతవారికేని యసాధ్యమే! చెప్పినచో తెలుగు దేశమున వానికి తెలుగులో నికఘోకా లేదు. ఇది నాటు తెలుగు. దీనిని పాఠ్యగ్రంథముగా కూర్చినచో తెలుగు వారికి చక్కని తెలుగు పట్టుపడును. కాని ఇట్టి గ్రంథములు నిర్ణాయకుల దృష్టి కెక్కవు. కష్టములేనికమ్మని పుస్తకములు విద్యార్థుల మనసుల నాకట్టును గదా! విద్వత్తా సంపాదనము నేడు వెనువెను కలైనది.

కవి సింహాచల నారసింహుని నూరు పద్యములలో స్తుతించుచున్నాడు. అన్నియు సీసములు. ఉక్కు కంబమున నలవోకగా నావిర్భవించినవానికి సీసమున సాక్షాత్కరించుటలో సంశయమేమి? అచ్చమైన తెలుగు వృత్తము సీసము. నాటు తెలుగు భాష. అసలు తెలుగు దైవ మప్పన్న. కవి వెలితిలేని తెలుగు మొలక. సంస్కృత భాషకు మార్దవ మాధుర్యములు లేవని తెగువతో పలికెడి తెలుగు దెందముతోనే ఈశతకము నిడిచినది.

'యతో వాచో నివర్తంతే' అన్న ఉపనిషద్వాక్య మందుకొని దృశ్యము నదృశ్యమునగు పరమాత్మతత్త్వమును అనిదం పూర్వ ధోర

ణిలో వర్ణించినారు. తొలిచదువులే పరమాత్మను తెలియలేక మళ్ళినవి. వాని కందని నీవు నానాటు మాటల కందెదవా! నాటు మాటలతో మనకు అప్పల నరసన్న నందించినాడు.

“వీనులు లేకీవు వినెదు కన్నులు లేక కనెదు” ఇది పరమాత్మ యొక్క సత్తను వర్ణించుచు అతీంద్రియములైన సర్వ కార్య సమాచారములను వివరించు శ్రుతి. అచ్చముగా తెలుఁగు మంత్రముగా ఆర్ష దృక్కుతో ఉపాసించినారు. దాసనిశ్చయ మెంతనిక్కచ్చియో! పులిపొదుఁగు పిదుకబోవనౌనట! పామునోటనైన చేయి పెట్ట వచ్చునట! మొసళ్ళ రేవున స్నానమునకు దిగవచ్చునట! పిచ్చికుక్కతో నేస్తము చేయవచ్చునట! నేను తప్ప మరేమియు లేదని కూడు కూటములకు మాత్రముచేయాడు కొంటె మాటలు వినరాదట! భగవత్సంబంధములేని వాని సంబంధము పై కార్యములకంటె దుష్కరముగా వెల్లడించినారు. ఇదివారి పరమ నిశ్చయము. వెనుకటి కవులు కూడ ఈ నిశ్చయమును వెల్లడించినారు. కాని హృదయదఘ్నముగా ననుభవింపక అందలి మంచి చెడుగుల నాకళింపుజేసి కొనక దాసభారతి వెలువడదు. పర ప్రత్యయ నేయబుద్ధి వారికిగాదు సరిగదా వారి శిష్యులకు కూడలేదు అంతటి స్వతంత్ర నిశ్చయముగలవాడు. అంతటి నిగర్వి. అంతటి రసోన్మాది. అన్నివిధములైన దినుసులు సమ్మేళన కలవాడు ‘నభూతో నభవిష్యతి’ గదా!

దాసచిత్తవృత్తి ఎంతచక్కగా తీర్చబడినదో!

“అక్కటా! యాయాస్తి తక్కువ వోతర
మెక్కువ బ్రదుకు నాకెట్లువచ్చె?
వీపవి కాదిద్ది నేఁ గ్రొవ్వునన్ సల్పు
కొన్న సేగికి మారు కుడ్చుచుంటిఁ
తమగట్టుకొనఁ ద్రాళ్ళు దాఁదెచ్చుకొన్నట్టు
కోరి యీ చిక్కు తగుల్చుకొంటిఁ

దిమ్మరిదు సీలూడఁదీసిన తీరున
నే విట్టి పంటఁ గట్టెదవఁగొంటి
ముదిసియున్ జెడ్డవాడుకన్ వదలకుంటి
బిడెమెడసి తగవరిలాగు బ్రేలఁచుంటి
సీగడుసు వెఱ్ఱివానినీవేలెదెట్లు!"
రెంట బ్రాగుడు తిండి మెట్టంటు వేల్పు!

గడుసు వెఱ్ఱిదనము. గడుసుదనము, వెఱ్ఱిదనము. రెండునున్న వాడే! కావుననే నీవెట్లేలికొందువయ్యా! గడుసుదనమును సింహ ముఖముతో మార్చి, వెఱ్ఱితనమును మానవ దేహముతో మటు మాయము చేయుమని యభ్యర్థనము. చాల చిత్రముగ భావమును ప్రకటించుట దాస సహజశక్తి. కంట తడిరాదట! పాడిపాడిగా నేర్పు చేతకాదట! వట్టిమాటల బండారముగాదురా బాబూ! పొడి యేడ్పులు నా చేతగావు. నేను బూటకములవాడను కాను. ఆర్ద్రి హృదయముతో పరమార్తితోనే నిన్ను పలుకుదును. పాడుకొందు ననుట.

మంచి నడవడి లేకపోయినచో భగవత్సాక్షాత్కారము కలుగదని ఉపదేశము. ఈ పద్యము ఒక గండరువు. అనుకొన్నట్లు శబ్దములు హత్తు కొని యొదుగుట కవిపురాసుకృతపరీపాకము.

"దండము దండము దండము దండము
దండము వలమురితాల్ప? నీకు.
జోహారు జోహారు జోహారు జోహారు
జోహారెరచిదిండి సూడ! నీకు
గొండీలు గొండీలు గొండీలు గొండీలు
గొండీలు కదలి యల్లండనీకు
కైచాఁపు కైచాఁపు కైచాఁపు కైచాపు
కైచాఁపనలఁబుట్టుకంటి! నీకు

అలకాపరి దీవెలకోల నీకు
మోడు బోయడు చెమ్మటలాడనీకు
మఱిమఱియు మొక్కులో పెరుమాళ్ళ నీకు
రెంటఁ త్రాగుడు తిండి మెట్టంటు వేల్పు ।

ఇందు పదముల పౌనరుక్త్యము తద్గతమైన భావనైరంతర్యమును స్పష్టము చేయుచున్నది. దాసదృష్టి విశేషమిది. ఎన్నివిధముల పద్యమును మలచి విరిచి శబ్దించి వ్రాయనగునో అన్నివిధముల వ్రాయగల శక్తి దాసశక్తి.

చివరిపద్యములు అచ్చమగు తత్త్వమును భక్తినిచాటును. సాంసారికములైన పరిస్థితులన్నియు కల్లజంజాటములైనవి. ఇదివట్టి మాటగాదు. అనుభవముతో పండినమాట. ఆపంటకు తరువాత పద్యము సాత్త్వ్యము. సమత్వబుద్ధి.

"విద్యావినయసంపన్నే పండితే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితాస్సమ దర్శినః"

"సమశ్శత్రౌచ మిత్రేచ—ఇది పరమ వైరాగ్య సంపద. ఈ సంపదకు వైరాగ్యము బీజము. కావున నీ పద్యములు కేవల వాచనికములుగాక అనుభవ పూర్వములనుట కుదురు కొనుచున్నది. వీరితత్త్వము భక్తిప్రధాన మంటెనిగదా! చివరికి వారు శ్రీనారసింహుని కోరెడిది ఒక్కటే! అది ధ్యానభక్తికాదు. అనన్యభక్తి. అదినిజముగా నొక వెఱ్ఱి. అదిలేక ముక్తిలేదు. తన ఆరాధ్యదైవమును పసికందునువలె, స్నేహితునివలె, సోదరునివలె, తండ్రివలె, దల్లివలె, భర్తనువలె, ప్రభునివలె, ఉపచరించుట. ఉపాసించుట

"నా ముంగిటన్ విల్వ నాయనా ౹ నీకునేఁ
బోయుదు నాఁబాడి పొట్టనిండ
నాపాలికిన్ రమ్ము నాయనా ౹ నిన్నుమ
లాకలోముంచి నీకాకమాన్తు

వాకుఁగాన్పించుము నాయనా! పీమేను
విమిరి నీబడలికల్ నెట్టివైతు
నాచెంత నుండుము నాయనా! యనయము
నన్నులాగున నిను న్గాచుకొందు
చెల్లబిడ్డలహార్ప కూడెల్ల-పలి నుంతతోనుంటివేనాటి నుండి యిట్టు
లానుమికనైన నావల్కు-పానకంబు రెంట త్రాగుడు తిండి మెట్టంటువేల్పు.

ఇది నిజమైన కవికిగావలసిన యార్తి. భాగవతమున నడుగడున ప్రత్యక్షమయ్యెడి భగవద్విషయకరతి. ఇదివీరికి పుట్టుకతో బట్టినది. ఎరువుకాదు.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి మాస్వామిలోని యీ పద్యము గుర్తునకు వచ్చును, పౌర్వాపర్యముతోనిట బనిలేదు. ఏక జాతి ప్రయుక్తమగు భగవదుపచారరూప మనోధర్మమును మాత్రమే మనవిచేయుచున్నాను.

"కరితో ల్పుట్టము కొంగుతో పునుక భిక్షాపాత్రచేబూని పం
న్కారణం బించుకలేమి మైజడలుమూఁగన్, బొజ్జ పెల్లాకటన్
సురుగన్ ముమ్మొన కత్తితోఁతడుముకొంచున్ లచ్చిగేహంబుముం
దర విల్చున్ భయదీయభిక్షుకత కంతంబెప్డు? విశ్వేశ్వరా!"

ఎందరెందరో పరమశివుని భావించినారు. ఆ శివమూర్తిని ఆ ఆదిభిక్షుని భైక్షవృత్తికి జాలిపడిన వారెందరు? అంతటి పరమార్తి పూర్ణమగు హృదయమెందఱు కవులకు కలదు? సరిగా ధూర్జటి తిన్నని ముఖమున జాలిపడినాడు. వీరు స్వయముగానే జాలిపడుచున్నారు. దాసకవిత ఉత్తమజాతిది. మహచ్ఛబ్ద విశేషణ యోగ్యమనుటకు ఇంతకంటె ఉదాహరణ మేమికావలెనో!

ఉపసంహారములో కవి న్యస్తభరత్వము స్పష్టమగుచున్నది. నాటుమాటుతో చెప్పితినయ్యా! నాలోటునెంచవద్దు. నానోరు తెలుగునోరు. ఇంకొకటి నానోటరాదు. వచ్చెనేని సహజముగా

నుండదు. నీ వచ్చమైన తెలుగు దయ్యమవు.— కాని ఒక్కటి. నాకేది లెస్సయో ! ఏదికాదో నేనెఱుగను. నాయం దేదోసగుండెనో గుణముండెనో నేనెఱుగను. నీవే గ్రహించి నాకు కావలసిన కోరికను ప్రసాదింపుము. ఎల్లప్పుడు నిన్నిట్లే పాడుకొనుచు నాడు కొనుచు నూరేండ్లు హాయిగా బ్రతుకనిమ్ము. ఇది దాస ముగ్ధహృదయ లక్షణము. మోక్షము కోరలేదు, కోరనక్కరలేదు. ఇంతకంటె మోక్షమున కధికారి యెవ్వడు ? అది స్వామికి తెలియదా ! కోరని కోర్కెనెరుకతో నొసంగుమనుటలో నిదిచిత్రము! దాసుగారు సంసారమునకై తాపత్రయము పడినట్లు కన్పింపదు. వారు యోగివైఖరి భూత భవిష్యత్తులను దర్శింపగలవారు. తాను కవియై పుట్టినవాడు గావున తరువాతి వారికి వలసినంత స్తోత్రసంపదను త్రవ్వియిచ్చినాడు

ఐదవది సత్యవ్రతి శతకము. పద్యసంఖ్యా విశేషమును పురస్కరించుకొని లాక్షణికవచనము నందుకొని శతకమని వ్యవహారము సిద్ధము. శతకముగాక మరేమగునో యన్న అద్వితీయ దాస ప్రతిభా వైదుష్యముల కెత్తినమణి ధ్వజము; సమస్యాపూరణము.

చాలమంది యవధానుల నెఱుగుదుము. మహాశుకవుల నెఱుగుదుము. ఒక్క సమస్యను పూరించుటకే జన్మమెత్తినంత పని యగును. ఒకటి రెండు విధములుగా పూరించు నప్పటికే తడియారును. ఇదేమియో కాని ఒకే సమస్యను నూరు విధములుగా పూరించుట మానవసాధ్యమా! నాకు మాత్రమిది ప్రశ్నయే!

ఇట్టి విషయమున ఒక సమస్యను నూరువిధములుగా పూరించి సెబాసనిపించుకొను నట్టి సామర్థ్యము నాయెఱిగినంతలో దాసుగారికే యున్నది. తడవు కొనకుండ ఒక్క ప్రాసతో వంద విధములైన విషయములను తెచ్చి పూరించుట. ఆపూరణలన్నియు నందదుకులు గాక రమణీయములుగా నుండుట ఎంత అదృష్టము. భారతీచరణ మంజీర ఝుళంఝారావములేగాని ఇవి పద్యములా అనిపించుచుట ఎంతసుకృతమో!

సమస్యాపూరణాత్మకమైనను నీతి బోధకమగుట చిత్రము! కావు నసే దీనిని ప్రత్యేకముగా గాక శతక సంపుటిలో చేర్చుట. ఎన్నిలోకాను భవములు' చమత్కారములెన్ని? సత్యప్రకటనములెన్ని? ఆతీరులు గమనింపుడు. ప్రాసలవలెనే ఉపమానములు గూడ కుప్పలు తెప్పలుగా దొరలి వచ్చి పడుచుండును.

"బ్రతుకన సుంకంబెఱుఁగక
స్వతంత్రరాజ్యమ్ము సేయు ప్రభువు వలె, పతి
వ్రతవలె సహజకవి వలెన్
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్"

సుంకమాసపడని స్వతంత్రరాజు వలెను, సహజకవి వలెను సత్యవ్రతికి సంతసమిచ్చునట! ఈ సమస్యలో కర్త సతతము అను శబ్దము. ఇది అవ్యయము. తెలుగున ము ప్రత్యయము వచ్చినది. ఈ సతతశబ్దము త్రికాలార్ధ గర్భితము. ఇది సత్యవ్రతికి సంతసమును గూర్చును. కాలమెట్లు కూర్చును? కాలాభిన్నమైన దైవము కూర్చును. దాసుగారు దేనినైన సహింతురుగాని అసత్యమును సహింపరు. సరిగా తిక్కన్నగారి తీరు కూడ ఇట్టిదే! వీరిరువురు వ్యాసహృదయ మెఱిగిన వారు.

"నడవడియను మున్నీటిం
గడవంబెట్టంగ నోడకరణిం దగి తా
నొడ గూడుననిన సత్యము
గడచిన గుణ మింక నొండు గలదే యరయన్—
"సర్వ తీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యమ్ముతో సమముగావు"

ఇది సోమయాజిసూక్తి. ఆసూక్తికి ఈ నూరుపద్యములు వివ రణము. అని తాత్పర్యము. సత్యవ్రతి హృదయము స్వతంత్రప్రభువు వలె నిర్భీకమై, పతివ్రతవలె ధర్మాధారమై, సహజకవితవలె సత్యానంద

మయమై యలరారుటలను చక్కగా చిత్రించినాడు. ఈ ముప్విధము లైన యానందములు చిదచిదీశ్వరానంద సహ్యాత్రతములు. దాసభారతి చిత్రముగా మహావిషయములను పాఠకహృదయముల హత్తించును.

అసత్యవచనము తేలుకాటువలె కన్పించకుండ మిక్కిలి బాధించునట. ఆ బాధ ఓర్వరానిది. అప్పుడు మంత్రమహిమ కావలెను. అనగా అసత్యములాడువాడు వానితోవన వాడు ఇచ్చువచ్చిన దబ్బర లాడుచు పోగా అవి తేలు కాటువలె సజ్జనులను బాధించి తీరునుగదా! అప్పుడు అసత్యములు విన్న వాడు నిదానించి యాలోచించవలెను. మంత్ర శబ్దమునకు దేవతా విషయక వర్ణాత్మకత్వమేగాక ఆలోచనమన్న యర్థము నున్నది. ఆలోచించి నిజమెఱిగిన వానికి మంచి సంతోషమే కలుగును. దుర్బలుడైన వానికి పుండు లేచిన అది క్రమముగా వ్యాపించి ప్రాణాపాయము కలిగించినట్లే అనృతవాక్యము ప్రాణహాని కలిగించి తీరును.—అసత్యము మెల్లగా చోటు చేసికొని క్రమముగా రోగము వలె వ్యాపించి పుండయి ప్రాణములు తీయుననుట అనుభవ దూరము కాని విషయము.

కొన్ని లోపములను నిర్భయముగా చాటెడి ధైర్యము దాస భారతి సొమ్మే!

"క్రతువు మిషపెట్టి ధనముల
నతి నిపుణతఁ జెనటి కూర్చి యాలికి నగలన్
మితి మీఱఁ బెట్టి పొలియఁగ
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్"

వీరిహృదయము హింసాత్మకములైన క్రతువులను మెచ్చదు. వీరి వాఙ్మయములో పెక్కుచోట్ల నీ విషయము ప్రస్తుతము. హింసారూపదోషమే గాక, యజ్ఞము మిషతో సంపాదించి దానికై వినియోగింపక భార్యకు నగలు చేయించుకొనువాడు ఎన్నడేని నీచముగా మరణించునట!—అప్పుడు సత్యవ్రతికి సంతసము.

"యతి వేషమ్మంగైకొని
మతిహీనుల బెదరగొట్టి మాటున దంభం
బతిభోగముల కృశింపగ"—సత్యవ్రతికి సంతసము.

అదికిన బూడెద పట్టెలు, ఉదికిన మడిపోవతి గాత్రములు; నదీ స్నానాదులు సత్యముతో సమములుగావు. అని వీరి సత్యాసన్నిహిత సిద్ధాంతము. మత దంభముతో కావించెడి చక్రాంకితములు; హోమ వ్యాజమున కావించెడి పశుహింసలు సత్యఫలము నీయజాలవు. ఇది వీరి సిద్ధాంతము.

ఇట్టి క్రమముతో నీ వంద పద్యములు సమస్యా పూరణ రూపముతో శతకమై నీతులను ధర్మములను లోకమున కందించు చున్నవి.

ఇది పంచశతిలోని విషయము. దాస పంచశతి లోకతత్త్వమును దైవతత్త్వమును మానవ మనస్తత్త్వమును చక్కగా చిత్రించినది. దాసుగారు చిత్రింపలేని దేదియు లేదని నానమ్మిక. ఎంతటి మహావిషయమున నైన అలవోకగా ప్రస్ఫుటింపజేయుగలరు. ఇది పుంభారతీ స్వరూపము. నానా విధరసవత్కలా సర్వస్వ మణి మంజూష దాసుగారు. ఒకపుడు బ్రహ్మకును సరస్వతికిని ప్రణయ వివాదము పొసగినది. బ్రహ్మ కొంచెము తొందర పడినాడు. సరస్వతి కొంచెముగా గర్వించినది. ఎవరి ఆత్మ విశ్వాసము వారిది.

'నాయమవి నాల్గు మోములు' అన్నాడు 'అవునా' అని అవహేళనాభివ్యంజకమందహాస మొలికించినది. 'ఎటు ముద్దిడెదవు?' ఇది బ్రహ్మ ప్రశ్న. ఇప్పటికి బ్రహ్మమాట నెగ్గినట్లే యున్నది. విజయ సూచక మందహాసమున చేసినాడు. సరస్వతి యనంత ముఖయన్న సంగతి ఆసమయమున బ్రహ్మమనస్సున మెదలలేదు. 'అనంత ముఖిన్ ననునెట్లు ముద్దిడంబోయెదో' వాణి పరిహాసించినది. అపుడు చతుర్ముఖుడు గితుర్మ

ఖుడైనాడు. ఎవ్వరికిని జెప్పికొన వీలులేదు. గృహకలహము, అందును ప్రణయకలహము. ఉన్నట్లుండి నలువ నారాయణదాసైనాడు. సరస్వతి సిగ్గు బరువున తల వంచినది. జితాస్మియన్నది. ఇది దాసత్వము. ఇది మధుర సరస్వతీ మనస్సరోవర వికసిత పుండరీక మధుర మాధ్వీక ప్రపంచము. బ్రహ్మ ప్రపంచములను ఉపాదాన కారణ సామగ్రీ సముల్లాసముతో చిత్రింపగా; మధుర సరస్వతి మనోహర రసభావ ప్రపంచమును సృష్టించి ముగ్గురు మూర్తుల విలాసములను చిత్రించినది. ఈ చిత్రణ అపూర్వచిత్రణ. రసవత్కల్పనా పరమోదాహరణ భూమి. కవి సహృదయు లక్కడనే కదా విశ్రమించుట.

దాసుగారట్టివారు. దాసభారతి యిట్టిది.

"ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహురివ వామనః

అన్నట్లుగా నాకు మిగిలిన పనికి నేను బూనితిని. ఎంత నిర్వర్తించితినో? కలనో? నేనెగటుగను. పెద్దల యాదేశమును సంతరించితినన్న సంతోషమేగాని వేరు కాదు. సమగ్ర సందర్శనము చేయలేక పోతినన్న బెటుకు నాకులేదు. శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారే యిట్లన్నారు.

"ఈయఖిలమ్మునందు. బరమేశ్వరుం డెట్టుల నిల్చియుండెనో
ఆయఖిలమ్ము వచ్చి తనయంతన నుండెన ఆదిభట్ట నా
రాయణదాసులో హరికథా కృతి భారతి సర్వశిల్ప వి
ద్యాయుతి సంస్కృతాంధ్రముల యాకృతియై పెటుమూర్తులై మటిన్"

అంతవారట్లనగా నేనే మనగలను?

దాసభారతిని వర్ణింతు నందునా? మధుర సరస్వతి మాధుర్యము సగ్గించి మూగవోవనో?

నాయుపి నాల్గు మోము 'లవునా'? 'యెటు ముద్దిడె' దంచు నల్వ ఆ
ప్యాయముగా హసింపఁగ,—'అనంతముఖున్ నను నెట్లు ముద్దిడం

బోయెదొ' అంచు చెల్వనగః 'ముద్దిడెదన్ గను' మంచు నల్వ నా
రాయణ దాసుగాగ—త్రవనందు సరస్వతికిన్—నమస్కృతుల్

ఇక సెలవు.

ఆది బ్రహ్మ సభ. ఉషః కాలము.

ఆ ప్రదేశము చూచిన గురుతు నాకులేదు. ఏదో చిత్రమైన ఒక అనుభూతి. అట తమస్సులేదు. దుఃఖము లేదు. అలుపులేదు. ఆత్మానంద కరమైన ఒక సన్నివేశము. దూరదూరముల నుండి ఉదాత్తానుదాత్త స్వరిత మనోహరమగు వేదధ్వని వినిపించుచున్నది. ఆధ్వని తరంగములలో నాయాత్మ మంద పవనడోలా విహార సంతుష్ట కుసుమసుకుమార పరిమళరేఖవలె పరవశించుచున్నది. అది సారస్వత మూర్తులు కూడిన ఒక సభ.

ఏ దేశమునందేని ఏభాషయందేని విద్రోహాత్మకములైన పరిణామములు ఏర్పడినచో నట్టి సభ జరుగును. ఆ సభకు సర్వవేదాధికారి యగు బ్రహ్మయే అధ్యక్షుడు. శ్రీవైకుంఠమున పరమాత్మకు నిత్యసేవా విశేషముల నిమగ్నులైనవారు సైతము ఆసభకు వత్తురు. అది ఆసభతీరు. ఈ విషయమంతయు నాకంటె ననుభవముగల పెద్దలు చెప్పుకొనుచుండగా నేను అచటనే వింటిని. ఆ సభను తప్పక దర్శింపలెనని యుత్కంఠ పెరిగినది.

ఎంత నడచినను ఆసభ దగ్గరమైనట్లే యున్నదిగాని దూరముననే తోచుచున్నది. తేజోవేగముతో తొందరించితిని. ఆసభ తీరు ప్రదేశము వద్దకు చేరితిని. నావంటి వారు చాలమంది సభా సందర్శన సముత్కంఠతో వచ్చిచేరిరి. వారందరు ఎన్నిదేశములవారో ! ఎన్ని భాషలవారో ! చెప్పలేను.

గంధర్వులు కిన్నరులు కింపురుషులు మొదలగువారు విచ్చేసి నట్లు రామాయణభారత గ్రంథములలోని వర్ణనలనుబట్టి వారి రూపులనుబట్టి గ్రహించితిని. మందాకినీ చామీకర తామరస గంధబంధురోదారములగు దివ్యవాయువులు నూతనోత్తేజమును కలిగించినవి. పుణ్యప్రవాహముల స్నానములు చేసినట్లైనది.

అంతలో "ఏతత్సామగాయన్నాస్తే." మొదలుగా తైత్తిరీయమునందలి విధానముతో సామగానము ప్రారంభమైనది. ఋషులు దేవతలు వరుసలుగా వచ్చి సభ నిండుచున్నారు. ఆ సభలో శాస్త్రార్థము ప్రారంభమై క్రమముగా కావ్య పరీక్షణమువరకు వచ్చినది. అపుడు నారాయణ తీర్థులవారు, జయదేవులు లీలాశుకులు, పోతన్న, రూపగోస్వామి ప్రభృతులు కొందరొకచో దర్శన మిచ్చినారు. కృష్ణలీలాతరంగిణి గీతగోవింద కావ్యములనుండి గానముచేసిన పిమ్మట తుంబురు నారదులు విచిత్రమైన ప్రశ్న వేసినారు. మోక్షమునకు శాస్త్రములు సాధనములా? భక్తియా? అని. అప్పటి వరకు తదేకబుద్ధిగా నున్న సభ కించిచ్చలితమై సమాధానమునకై బ్రహ్మనాలుగు ముఖములవైపు నిశ్చలముగా చూచుచున్నది.

బ్రహ్మ నాలుగు మూలలు కలయజూచినాడు.

ఎక్కడనుండియో శంభో యను కేక వినిపించినది. అది మానవమాత్రులైన వారి కంఠమునుండి వచ్చెడి ఆర్తితో నిండిన కేక. ఆధ్వనియే వాయుతరంగములలో తారాడినదో ఆ వాయుతరంగములు సభలో వ్యాపించినవి. ఆగాలితాకిడికి వీణలు మ్రోగినవి. మద్దెలలు ధ్వనించినవి. తంబురలు శ్రుతులు సరిచేసికొన్నవి.

అంతలో నొకమూర్తి ప్రత్యక్షమైనాడు. పెద్దమీసాలు. గిరజాల జులపాలజుత్తు పీనకవాట వక్షము. మాంసల వృషస్కంధము. పీవరాజానుబాహుభుజములు. ఫాలభాగమున కుంకుమబొట్టు. నడుమున

కాసె. చెంగావి పట్టుపుట్టము. కాళ్ళ గజ్జియలు. పురుషమోహనా కారమైన ఒకవ్యక్తి.

ఆసమయమే నారాయణదా సనిపించినది. ఒక యామమాత్ర కాలము సంస్కృత భాషలో హరికథామృతమును వర్షించినదా మహా పురుషమేఘము. బ్రహ్మ నాలుగు ముఖములతో నెనిమిది కనులతో మహానందము నభివ్యక్తము చేసినాడు. వారి యన్నదమ్ములు వచ్చి నారు. ఎపుడో తాను మహాశుద్ధధోరణిలో వ్రాసిన చెప్పిన పంచశతిని వినిపించినా రామహాకవి. ఆసభకు తెలుగుతో నంత పరిచయములేదు. సంస్కృత సమాసముల నానందించి మెచ్చినారు.

ఆదర్శనము దర్శనమే! నేను దార్శనికుడనుగానుగదా! సంగీతమా! నాట్యమా ! వీణావాదనమా ! మృదంగనిస్వానమా ! కవిత్వమా ! శాస్త్రతత్త్వ వేత్తృతయా ! హరికథా రచనమా ! ప్రవచనమా ! అచ్చమైన సారస్వతమూర్తి దాసుగారు. వనితనము గలిగిన శిల్పదర్శ నముకంటె నీదర్శనము పరమోదాత్తసుందరము.

చిత్రము! మరల వెళ్ళినపుడు వారు జయదేవాది మహా పదకవి సమూహములో నడచుచున్నారు. నేను 'దాసోహ'మంటిని. 'నారాయణ దాసోహ'మన్నారు వారు. ఒకని మేషము వారునన్ను, నేను వారిని తెప్పవాల్పక చూచికొంటిమి. ఇపుడు మీ శతకములకు పీఠిక వ్రాయు చున్నానంటిని. చిరునవ్వుతో దాసదర్శనమైనది గదా అన్నారు. ఇది దాసదర్శనమైనది.

నాయందలి నిర్వ్యాజ ప్రేమతో ఆదరముతో ఈపీఠికారచనా గౌరవమును నాకు దక్కించిన శ్రీ కర్రా ఈశ్వరరావు గారికి ఆజ న్మాంతము కృతజ్ఞుడను. ముద్రాపకులు శ్రీ కర్పూరపు రామకృష్ణ మూర్తిగారు ముద్రాపకప్రశస్తి కర్హులు.

"సరస్వత్యాస్తత్త్వం కవిసహృదయాఖ్యం విజయతే"

కోగంటి సీతారామాచార్యులు

శ్రీ

# సూర్యనారాయణ శతకము

మ॥ ప్రత్యక్షంబుగ నీవు లోక మలరింపం బెంపఁ ద్రుంపం బళి
ష్కృత్యంబుం బొడఁ గాంచుచుండి యు జనుల్ భక్తులై యుండఁ బో
కత్యంతంబును లేనిదైవముల నూహం బన్ని సేవింతురో
స్తుత్యప్రాభవయే మొకో భువనబంధూ సూర్యనారాయణా॥ 1

మ॥ అరవింద ప్రియ నీవు దూరమగు నప్డయ్యయ్యో యుద్భ్రాంతదు
స్తర ఘోరాంధతమిస్రమగ్న మయిభూతవ్రాతమా పత్పరం
పరలం బొందును నీదు తత్త్వ మెడలిం పన్సర్వమున్మాన్యమౌ
నరయన్నీ వె చరాచరంబులు మహాత్మా సూర్యనారాయణా 2

శా॥ జారుల్ చోరులు విద్రలుం గలలు కాసల్వాతరోగంబులు
న్మారక్రూరశిలీముఖప్రబల సంతాపంబులున్ ఘోరఘూర
కారావంబులు దిగ్ర్గ్రహమల్మతిదురూహాల్పిడలుం బూచులు
స్నీరమ్యాతపమందుఁ గల్గ చెటు తంద్రీ సూర్యనారాయణా॥ 3

మ॥ వనజంబుల్కనువిచ్చి చూడఁ గలువల్వాడన్ద మంబాడఁ జె
ల్మివిజక్రంబులుగూడఁ దెమ్మెరలకున్లేఁదీగెలల్లాడ వే
డ్కనునానావిధపక్షి సంఘములు పాడన్దావసు ల్వేఁడ నీ
వనురాగంబునఁ దూర్పునం బొడమె తయ్యా సూర్యనారాయణా॥ 4

మ॥ నలుపై నంభువిలోనఁ జూపి పరిమాణం బెంతయో కల్గుచు
క్కలకుం జాటొనరించి భూమిజలమింకం జేసి ధారాధరం
బులమింటం గలిగించి శస్యము సకుం బొల్మెరఁ గల్పించురా
యెలమిన్నీకర కౌశలంబహహమాయీ సూర్యనారాయణా॥ 5

మ॥ తమముంగొట్టు ఫిరంగిగుండయవధూతల్బ్రోవుకై వల్యగే
హమణీవృత్తవిదానమాసకలరో గారణ్యదావాగ్నిచ
క్రమమందేహధరాధర ప్రబలవజ్రంబాత్రిమూర్తి స్వరూ
పమయింకెట్టులవిన్నుఁబిల్వఁగనప్పాసూర్యనారాయణా॥ 6

మ॥ అవురాయెట్టిమతాబుపోల్కినుదయాస్తాద్రిద్వయిందేరివి
న్నువిలోకింపఁగవచ్చుఁదక్కనభమందుంజూడశక్యంబుగా
దువివేకింపఁగబాల్యవార్ధకము లెందుంజల్లగానుండియి
బ్బువిసంతాపముఁజేయలేనిదివిజంబోసూర్యనారాయణా॥ 7

మ॥ విరతంబున్నినుఁగొందఱజ్ఞజనులగ్నిద్రావకంబంచుఁకొంగొం।
దఱులోకాయతనేత్రమంచుమఱికొందర్తప్తసౌవర్ణభా।
సురగోళంబనికొందఱున్ద్యుమణివంచుంబాపురేపోల్చుచుం।
దిరిజాత్యంధులుదంతినాధువలెఁదండ్రీసూర్యనారాయణా॥ 8

మ॥ తొలిరంగెద్దియు లేవిసీకికరణసందోహంబువాక్శీకరం
బులనానావిధవర్ణయుక్తమగునపోల్కినిన్నెరాకని
ర్మలనిర్లేపితనిత్యకేవలపరబ్రహ్మంబునీవయ్యుని
మ్మలమాయఁబలురూపులంజెలఁగెదట్టోసూర్యనారాయణా॥ 9

మ॥ ఉదయాద్రిన్నినుఁజూచినంతవెలనెంతోపాఱుచీఁకట్లువెం
టఁదగుల్నీపథకోడివావిదగుకూనల్పాదుఁనన్నీడకై
యెదుగన్పావివిరేయితల్లికడకో హూతూర్పునంబంపుసీ
దుదయన్నాతరశూగణింపగుణసింధూసూర్యనారాయణా॥ 10

మ॥ సహజంబెవ్వరికైనవృద్ధియునునాశంబంచుసూచింతువీ
వహహాతూర్పునఁబుట్టిపశ్చిమమునంతస్తంబునుంబొందిప్ర
త్యహముల్లోకవిడంబనార్థమయినిత్యాద్వైతభావంబున
న్రహిపొప్పారియువేసకాఁడవయియన్నాసూర్యనారాయణా॥ 11

శా॥ నీవొక్కండవనాదికారణుఁడవున్నీమాయసంభూతులౌ
జీవుల్రజ్జువునందుసర్పమటుయోచింపంగనిత్యప్రమో
దావష్టబ్ధజగంబునందుభ్రమచేనత్యంతమున్శోకము
న్పావింతు ర్తెలివందియు న్దెలియకబ్బాసూర్యనారాయణా॥ 12

మ॥ ఒకచోమందతయొక్కచోసమతవేరొక్కంటఁదీక్ష్ణత్వమిం
కొకచోనన్నియునుంగ్రమంబుగసదాయొక్కొక్కచోఁగల్మియు
న్ప్రకటాభావమదృశ్యదృశ్యగతియున్వ్యాపించుజ్ఞానంబునీ
యకలంకద్యుతిమాడ్కినిజ్జగతినయ్యాసూర్యనారాయణా॥ 13

మ॥ కమలాశిన్వికసింపఁజేయునెకశృంగారంబుహాస్యంబుదు
ర్దమమందేహతమిస్రమారణమునన్రౌద్రాద్భుతోద్వీరసం
క్రమభీభత్సభయానకంబులులసత్కారుణ్యముందావకీ
నమహాభక్తులయందున స్తగిరిపొంతన్శాంతభావంబునీ
వమరంజేయుదునిత్యనిర్గుణుఁడవై హాసూర్యనారాయణా॥ 14

శా॥ నీకంటెన్మఱివేరులేదయినవిన్నేనీవునానావిధా
స్తోకస్థావరజంగమాఖిలజగచ్ఛోద్యంబుగాఁబన్నుచు
న్స్వీకన్సత్త్వరజస్తమోగుణములన్గ్రీడింతువాహాకల
న్లోకంబెల్లమనంబెయైనగతినెంతోసూర్యనారాయణా॥ 15

మ॥ తరమానీదగుదివ్యతత్త్వమిదమిత్థమ్మంచుయోజింపనె
వ్వరికైనన్మఱియూహసేయుకొలఁదిన్బల్మాఱుసందిగ్ధమౌ
నరయన్నెమ్మదిదీనివిశ్వలముసేయన్రాదుగాలోమము
న్సరినిల్పన్వశమెట్టులార్తజనరక్షాసూర్యనారాయణా॥ 16

మ॥ సరవిన్మేఘములందుఁజంచలతనక్షత్రంబులన్ దేజము
న్మఱియున్వేఁడిమిజాతవేదునెడజ్యోత్స్నాపూరముంజంద్రునం

దురహింజాదిక్రియునే ఆగోళములయందున్నెక్కువర్ణంబుల
ద్దిరభూతంబులఁగల్గునీవలనఁగాదేసూర్యనారాయణా॥ 17

శా॥ ఏకేమేకయనట్లుసంస్కృతిమదీయేచ్ఛాకృతంబయ్యునా
కాకల్పించెనుశోకబంధమననేలామెట్టవేదాంతినీ
వేకార్యంబునుగారణంబనుచువిన్నేవిత్యముంగొల్చినీ
యాకారంబునభక్తుఁడుండఁబరమాత్మాసూర్యనారాయణా॥ 18

మ॥ మనసన్దర్పణమందుమాత్రమెతలంపన్మూడవచ్చున్జగం
బునుబల్మాఱుసుషుప్తిదావివెనువైపూబోలిశూన్యాకృతి
గ్గనుపర్చున్మఱిదృశ్యమిద్దిమృగతృష్ణావైఖరిన్మాయయౌ
ననఘానీవెనమస్తసాక్షివిమహాత్మాసూర్యనారాయణా॥ 19

మ॥ సరిగాబౌద్ధులువిన్నభావముగహంసల్పత్తుగాఁదార్కికు
ల్పరమాణుస్థితిగాబహుప్రకృతిగాఁబల్మాఱుసాంఖ్యుల్సదా
ధరమీమాంసకులెల్లఁగర్మగఁబరంధామంబుగాయోగులం
దురునేనోమఱినీవెసర్వమవియందున్సూర్యనారాయణా॥ 20

మ॥ పరఁగన్జీవులుసంచరింతురధరోర్ధ్వప్రక్రమత్వంబుగా
నయన్వొండియునామరూపములుశూన్యంబంచుసూచించుఁద్వ
త్కరములగ్గంట్రడిగవింటికొప్పదగురంధ్రమ్మోమముంజొచ్చియ
ద్దిపభ్రాంతాణుపరీవృతంబులయిధాత్రిన్సూర్యనారాయణా॥ 21

శా॥ నీభక్తుంకగువాఁడెరూపబలశాంతిస్థైర్యలక్ష్మీయుతుం
డౌభావింపఁగసర్వభూతసముఁడౌనత్యంతసత్యవ్రతుం
డౌభవ్యప్రతిభాన్వితుండగువదాన్యశ్రేష్ఠుఁడౌఖ్యాతపూ
తాఖిఖ్యుండగుదీర్ఘజీవియగునన్నా సూర్యనారాయణా॥ 22

మ॥ తలఁపన్వేజ్జీవితానవిజ్జగమసందర్భంబుగావిత్యని
ర్మలసంపూర్ణవిరీహవిర్గుణపరబ్రహ్మంబునీవయ్యుని

ట్టులగావించెదవన్ననమ్మకమదెట్టుల్ద్రోచులోకంబుల
న్నలుపన్జిత్తముకన్నకారణమెదన్నాసూర్యనారాయణా। 23

మ॥ అనయంబార్తులఁబెంచుఁగల్గి వలుకండన్యాయవిత్తార్జనం
బునుగైకోఁడుపరోపకారమునుసల్పున్బెద్దలంజేరిన
ద్విసయంబున్గనుపర్చుభూతసముఁడౌఁదెల్లంబు గాసీయశ
మ్మునుగీర్తించుఁదరించుసజ్జనుఁడుబాబూసూర్యనారాయణా॥ 24

మ॥ దయతోఁబ్రాణులనెల్లనాత్మవలెసందర్శించుచుస్సాధుసం
చయముంగొల్చుచుసూనృతంబనుచుయుష్మత్పాదపంకేరుహ
ద్వయమున్మిక్కిలిభక్తిమైసతతముధ్యానించుపుణ్యాత్ముఁడే
భయమున్పొందఁడువీక్షపామహిమసప్పాసూర్యనారాయణా॥ 25

మ॥ సరిగాసంపదగల్గినప్పుడుమహాసౌఖ్యోన్నతింబొందిప
ల్మఱునీసర్వజగంబబద్ధమనిసంభాషించువేదాంతియ
ద్దిరకష్టంబుఅవంతవచ్చు నెడనార్తింగుందిసంరక్షకై
పరులన్వేఁడువివేకముందొఁలగియప్పాసూర్యనారాయణా॥ 26

శా॥ నీకంటెన్మఱిదిక్కు లేదువడినానేరంబులన్నెంచియీ
లోకంబందుననంజిరంబువిచియేలోపంబురానీకనన్
నీకీర్తింబ్రకటించవిమ్ముకడువిన్నేనమ్మికొన్నాఁడనే
నీకుంబిడ్డఁడసుమ్ముజ్ఞాపకముగొంటేసూర్యనారాయణా॥ 27

శా॥ నీదాసుండగువానికాపదలురానేరావుకష్టబ్బిన
మ్మాదినీకులువిల్వనట్లువడినెంతో దూరమైపోవుత్వ
త్పాదాంభోరుహచింతనౌషధముదప్పన్లేదుపాయంబువే
రేదైనన్భవరోగమూడ్చుటకుఁదంద్రీసూర్యనారాయణా॥ 28

మ॥ అకలంకంబగునీమహామహిమనత్యంతప్రమోదంబుతో
సకలశ్రోత్రసుఖావహంబుగలసత్సంగీతసాహిత్యభ

వ్యాకశాకల్పనఁ జేయుదాసులకు దీర్ఘాయుశ్శుభారోగ్యము
ల్ప్రికటాభీష్టములన్నియుం జెలఁగ నీరా సూర్యనారాయణా॥ 29

మ॥ తొలుదొల్తన్ వనితాదిభోగములివెంతో బల్సుఖాభాసము
ల్తలఁపంగా క్షణభంగురంబులటు మీఁదన్ దీర్ఘదుఃఖాకరం
బులటంచుం బలుమాఱెఱింగియు నసమ్మోహంబుతో మానలే
రిల నాబోటులిఁకెట్లు కాచెదవొ తండ్రీ సూర్యనారాయణా॥ 30

మ॥ కట్టామూర్ఖుఁడఁ దామసుండ దురహంకారుండ సజ్ఞుండనే
ఇట్టుల్చేనునఁ బడ్డగ్రుడ్డిపశువల్లెద్దావి నాదెంబుగ
న్నెట్టం జాలక దేహయాత్రగొనుచుంటిన్ మోహశోకంబుల
న్బిట్టల్లాడుచు నెట్లు ప్రోచెదవొ తండ్రీ సూర్యనారాయణా॥ 31

మ॥ ఇంద్రాతిన్గరఁగింపఁ జాలెడుఘనధ్వానంబుతో భాస్కరా
పుండ్రాంచన్ముఖపద్మ నీదుయశముల్నొప్పల్పరఁ గీర్తించున
న్వేంద్రంబొకథమంటనీకకరుణన్వీక్షించిరక్షించు మో
తండ్రీ సంశ్రితలోకబాంధవ మహాత్మా సూర్యనారాయణా॥ 32

మ॥ అయయో నీవయి భక్తి నా మదిదృఢంబై నిల్వకుంటన్ గదా
మెయికింగొంచెము బాధగల్గునపుడిమ్మైమర్త్యభైషజ్యము
న్భయమూఢాత్ముఁడనై కొనన్వలసె వాపా నీవుగా కెవ్వఁడా
రయ వైద్యుండు భవాధిమాన్పుటకు నోరా సూర్యనారాయణా॥ 33

మ॥ అవురా సర్వచరాచరేశుఁడవు నిత్యానందతేజోమయుం
డవు కారుణ్యపయోధివంచు విని వేడ్కన్నమ్మికొన్నాఁడన
న్నవలోకింపుము చల్లగాభయములన్బోఁదోలు నీకన్నది
క్కెవరున్నారు మొరాలకింపుటకుఁ దండ్రీ సూర్యనారాయణా॥ 34

శా॥ నాభీతిన్ దొలఁగించి పక్కునను నన్నవ్వించినావద్దిరా
నీభక్తావనచాతురిం బొగడఁగా నేనెంతవాఁడన్ స్తుతీ

లోభుండంగడుమూఢుఁడజ్ఞపలుఁడన్లోకేశపద్మాపతీ
నీభృత్యుండనునన్ను నేమఱకుమీ శ్రీసూర్యనారాయణా॥ 35

మ॥ వర్షంబున్బనసియకాకప్రమునన్వ్యర్థంబుగావారిదో
త్కర్షంబుం గలిగించెదేలనిటులుద్ధశ్రీవిధానంగడున్
హర్షంబుంజెడిప్రాణులెండెడుఁద్వరన్రక్షించుమాతండ్రిబ్ర
హ్మర్షిప్రస్తవనీయమానకరుణాఢ్యాసూర్యనారాయణా॥ 36

మ॥ నెఱినీలీలనునై సమస్తజగముల్నిల్పించుచున్
స్వరిగావేదముఖంబునన్బ్రజలకున్గర్తవ్యముందెల్పుచు
న్మఱికూటస్థుఁడవైననీదుపదపద్మంబుల్మదిన్గొల్చిన
న్దురితంబీపయినంటనీకుశ్రితబంధూసూర్యనారాయణా॥ 37

మ॥ జలమందజ్ఞతచేఁజొరంబడిశ్రమన్జానున్నచీమన్గృప
న్బలమాత్తొడ్డునవైచినందిరుగనాపంబద్ధియుంజేరున
ట్లిలదుష్కార్యములందమున్గుననునీవెంతోదయన్దేల్చిన
న్బళిరాసల్పెదనేరముల్మఱియునప్పాసూర్యనారాయణా॥ 38

మ॥ కలలోనీతగుదర్శనంబిడిమహాకారుణ్యముంజూపినా
కలరన్నీదుప్రసాదమిచ్చితివియాహాకావిరూఢిన్భవ
ద్విలసచ్ఛక్తిమహత్త్వముల్మఱుగుటన్దుర్విన్మానవుల్నమ్మన
ట్లిలమిన్నాయెడదివ్యశక్తివిడుతండ్రీసూర్యనారాయణా॥ 39

శా॥ నీరంబెంతయులేవియప్పుడుకడున్నిశ్శబ్దమైప్రాణిసం
చారంబేమియుఁగానరాకమఱివిస్తారంబునౌచోటవా
పూరంబబ్బహతాత్తజంతులుముదంబుంజూపుచందాననీ
కారుణ్యంబుననార్తులందెదరువేడ్కన్సూర్యనారాయణా॥ 40

మ॥ యుక్తాయుక్తమెఱింగియున్విహితులెన్నోమార్గబోధించినన్
నక్తంబుందివమున్గృతాఘములకున్సంతాపముంబొందియు

న్భక్తిన్నిన్భజియించుచుండియుసుమాసంజాలదుస్సంగమా
ప్తిన్నివ్విఁకనైనఁబ్రోవుఁబ్రీతుండసూర్యనారాయణా॥ 41

మ॥ పెనుకొండందశక్రిందఁబెట్టకొవియుఁబైఁబ్రాలకైదేవులా
డునటుల్మామకచిత్తపద్మమునన్నెప్డున్నాపుకొన్నట్టివి
న్ననజస్రాశ్రితవత్సలానిన్నువాసిబంధువ్మానియారోగ్యమి
మ్మనినేమర్త్యుఁభిషక్కులన్గడఁచనేలాసూర్యనారాయణా॥ 42

మ॥ శిష్టాచారముసల్పలేనుమతిదుశ్చేష్టల్విడన్జాలబల్
నష్టంబొందియునీపదాబ్జములదెసఁజెంబుంగమిన్నిప్పలే
నిష్టంబుండియుఁదెస్సెఁజెంగియుసుదుర్వ్యాప్తిన్వడిన్మానవేఁ
గష్టాత్ముండనుగాచెదెట్లుననువింకసూర్యనారాయణా॥ 43

మ॥ సరిగానీదగుభక్తుఁడెంతయుయథేచ్ఛన్సర్వభోగంబుల
జ్జిరకాలంబుసుఖించిశాశ్వతయశశ్శ్రీఁగాంచియంత్యంబుగ
న్దరపైఁదానణిమాదివైభవములన్గల్పించియాపిమ్మట
న్మరిసీలోనలయంబుఁజెందఁగలఁడన్నాసూర్యనారాయణా॥ 44

మ॥ సకలజ్ఞానముగల్గఁజేయఁగలయాచార్యుండునీకంటెవే
రికలేఁడంచుభవత్పదాంబుజములన్హృత్పీఠమందుంచిన
న్మికతోడంభజియించుదాసులకునిమ్మీసర్వవేదోరుశా
స్త్రికశాస్త్రైపుణిలోకులద్భుతముఁజెందన్సూర్యనారాయణా॥ 45

మ॥ ధరణిన్నీపదభక్తియందలిమహత్త్వంబిట్టిదంచెల్లపా
మరకోటిందెలుపంగనివ్వరములంబ్రార్థించితింగానియ
ద్దిరనీదాసునికైహికార్థములప్రీతిన్నివ్వకేవెట్టుభం
భరమున్గృత్రిమపుష్పముల్ధనుపునప్పాసూర్యనారాయణా॥ 46

మ॥ తనరంగాభువనైకసుందరవధూదంతచ్ఛదాస్వాదనం
బునకైకాదుత్రిలోకరాజ్యవిభవంబుంబొందఁగాఁగాదుశా

స్త్రీవిరూఢప్రతిభావిశేషముగుణజ్ఞాన్గోకికాదక్కటా
వినుసత్యంబుగఁజూడకేడ్చెదనుదంద్రీసూర్యనారాయణా॥ 47

మ॥ అరయన్మానుషజన్మమందుఁగలదుఃఖాగ్నింగడున్ద్రేపెడు
న్నరిగానైహికభోగవాంఛయనునాజ్యంబట్టులౌటన్భవ
త్కరుణావృష్టివిమామకీనభవసంతాపంబుఁజల్లార్చిన
న్ద్వరగాఁబ్రోవుమునీకుమ్రొక్కెదనుదేవాసూర్యనారాయణా. 48

మ॥ అవవిన్మానవజన్మమందుఁగలసౌఖ్యంబెన్నఁగానెల్కతో
కవిధానంగడుసన్నమౌఁదుదకుదుఃఖంబెక్కువౌనేటిపా
ర్థువలెన్గావునమామకానుభవమాలోచించిసంసారవా
ర్ధివడిన్దాఁటెదనీకృపాతరణిచేశ్రీసూర్యనారాయణా॥ 49

మ॥ ధనమారాదుదురాశపోదుపరతత్త్వజ్ఞానమాలేదుయౌ
వనమానిత్యముకాదువార్ధకమునన్వామాక్షియౌఁజేదుజీ
వనమాయెన్నఁగఁబాదుదుఃఖములకుంబల్మాఱటుల్గావున
న్నినునేఁగొల్తునిఁకేలవాదుదయఁగన్మీసూర్యనారాయణా॥ 50

మ॥ తనరంగాఁబరిపూర్ణభావమునమద్బాల్యంబువోవవ్వినూ
తనమౌయౌవనసన్నిపాతదశచేతభ్రాంతచిత్తుండనై
తినయారేవయసిప్పుడున్మరణనెంతేబుద్ధియన్నట్లుట
క్కునుగన్పుట్ఫుచిఁకేమినేనగుదునోకోసూర్యనారాయణా॥ 51

మ॥ అవురాగొంగళిలోనఁదించుఁదలపోయన్వెంట్రుకల్లెక్కనే
యువిధిందప్పులుపట్టుచుంద్రుకడునన్యోన్యంబువిభ్రాంతులై
యవనింబండితమానులౌఱములుమాయాకల్పితంబైనయీ
భవమందెట్లువివేకమబ్బఁగలదబ్బాసూర్యనారాయణా॥ 52

శా॥ నీవేదిక్కనినమ్మిసర్వమునకున్నీపైభరంబుంచియే
త్రోవన్నేవునెఱుంగఁబోకజగమందున్గ్రుమ్మఱంబూనిత్వ

తేన్పవా వైభవమిట్టిదంచు బ్రజకున్దెల్పంగయత్నించున
న్నీ వెల్లిష్టములిచ్చిప్రోచెదవొతంద్రీసూర్యనారాయణా॥ [illegible]

శా॥ ఇమ్మాద్కిన్నవదీయనామసుధ గ్రోలింపన్నదాతుచ్చభో
గమ్ముంజిత్తము గోరుమోదకమువేడన్నేమపశ్వానంబఖా
దమ్ముందబ్బు మెక్కనేగునటులిద్ధాత్రింభళీనై జిఫ
ర్మంబున్నామనుపవేరశక్యగు మహాత్మాసూర్యనారాయణా॥ 54

శా॥ ఉత్సాహంబునందావకీనయశమెంతోలోకులువొప్పంగను
ద్యత్సంగీతకవిత్వవైభవము చేతంజాటంగాంబూవితి
న్మాత్సర్యంబుదొలంగియెల్ల ప్రజనన్నన్నించునట్లీవుబ
ల్వాత్సల్యంబునంబ్రోచుచుండునదియుప్పాసూర్యనారాయణా॥ 55

మ॥ గుటిగానిన్నుజియింపకెందుకిటులంగొంతెమ్మకోర్కుల్మతీ
న్మతిదుశ్చింతలులేనిపోనియనుమానంబుల్వ్యథాచేష్టల
ద్దిరనావశ్యముగాకయెంతయునుమచ్చిత్తంబుగల్పించెడి
న్పరిగానీయెడదీవిబ్రదిప్వమినైనసూర్యనారాయణా॥ 56

మ॥ సమతన్లోకులకెల్లభూతదయయున్సత్యంబుబోధించుచు
న్రమణన్నీదగుకీర్తిరాల్గరంగగానప్రౌఢిచేజాటుచు
న్వ్రమదంబొప్పంబరాంగనావిముఖతన్వర్తించుచున్బ్రహ్మచ
ర్యమునేసల్పెదనాకుందోడుపడుమన్నాసూర్యనారాయణా॥ 57

శా॥ ఔన్నత్యంబెదవొందనీవిమలదివ్యాకారముంజూపినా
కెన్నండీవతయంబొసంగిమతినాయిష్టంబులందీర్చెదో
విన్నపేవినునమ్మకొంటినికనీచిత్తంబునాభాగ్యమో
యన్నావేల్పులమిన్నలోకములకన్నాసూర్యనారాయణా॥ 58

మ॥ ఖళిరాయెన్నివిధాలంజూచిననునీపాదంబుదక్కన్యమి
య్యిలలోంజింత్యముకాదటంచెఱుంగంబోకెంతేవ్యథాయాసము

న్నలుమోసంబు దురంతశోకముఁదు దిన్గాపించు కాంతావనం
బులకాసింతురునన్నుఁ జోఁజజమలబ్బ్ సూర్యనారాయణా॥ 59

శా॥ విష్కాపత్యము చెల్లఁబోదకటయా విర్వాగ్వచిత్తంబునం
దుష్కార్యంబులలో నవంచిపయి కెంతో నవ్కర్మైచర్యంబుల
న్నుష్కప్రేమయు కూన్యహస్తముల నెందుఁజూపకుంచునమ్మవో
విష్కావ్యక్షతఁ బొందవాదునద తండ్రీ సూర్యనారాయణా 60

మ॥ ప్రతిపాదంబు ప్రమాదయుక్తమయి యెప్పట్లన్దుర్జ్ఞానసం
యుతమౌచున్ క్షణభంగురంబయిమతెంతో బల్పుఖాభాసమౌ;
బ్రతుకున్నమ్మివృథా ప్రయాసమునన్వవప్న ప్రాయసంసారభో
గతతిన్మానఁగలే నెఱింగియు శుభాంగా సూర్యనారాయణా॥ 61

మ॥ అలరంగాజగమెల్ల వెఱ్ఱియెకదాయా వెఱ్ఱికిన్వేవిధా
లిలలో నెవ్వనిపిచ్చి వానికిముదంబెం తేనియున్మాదము
జ్జ్వల మైనంగదుహోవినల్పు మతిశాంతిం బైనసీధ్యానము
న్నలిలో కోపకృతిఁబొనర్చు నిజమన్నా సూర్యనారాయణా॥ 62

శా. భూతాదర్శమువంటి మాయయెడ సంపూర్ణైక జీవుండుప్ర
స్ఫీతం బైనప్రవృత్తి చేఁదనుజగచ్చిత్రంబుగాఁజూచిమో
హాతిక్రాంతుఁడునైవి వృత్తి మెయిస్వీయా ద్వైతభావంబుసం
ప్రీతింగాంచునటంచు నెంచెదను దండ్రీ సూర్యనారాయణా॥ 63

శా॥ వేదాంతంబునకున్ని జానుభవముర్వింజాల దూరంబునిః
ఖేదాద్వైత మదేడయిట్టులభి వాగ్నింగుందు నేనేడయా
ఖేదజ్ఞానము దేహమున్న వఱకుఁబీడించెదున్న న్ననిం
కేదారిన్బుఖ పెట్టఁజాలెదవు తండ్రీ సూర్యనారాయణా॥ 64

శా॥ త్వద్దివ్యాంఘ్రిశిరో జభక్తియదఁదప్పన్సర్వ వేదంబుల
న్మద్దల్పా ఱిగసించి నంజనుఁడుతన్నుఁదా నెఱుఁగండహో

యద్దంబందు నఁదకన్గన్నుఁగ వస్త్వేయా కారముంజూచు చె!
ల్లె ద్దేశంబున నైన నారయఁగఁ దంద్రీ సూర్యనారాయణా॥ 65

మ॥ కనుచుండున్సు ఖదుఃఖరూపముల జాగ్రత్స్వప్న కాలంబుల!
న్గనలేఁ డెయ్యెదియున్సు పుత్రధన కాంతాలగ్న చిత్తుండుకా!
వివినుంగొల్చు మహాత్ముఁడీ జగములన్ని త్యంబు వీక్షించియు!
న్మనమందందడిఁ కెవికారములనైన న్సూర్యనారాయణా॥ 66

మ॥ పనినాసింపకయే మహాత్ముఁడు మనోవాక్కాయ కర్మంబుల!
న్నిను సేవించుచుఁడునో యచవికిన్ని త్యంబుఁగామాదిశ!
త్రునికాయఁ బెచయొను వెండియును నీరూపంబుగాలోక మె
ల్ల విరూపించుఁ బ్రమోదకారియయిలీలన్ సూర్యనారాయణా॥ 62

మ॥ జగమందెల్ల క్రియల్ని జంబుగభవత్సంకల్పమూలంబుల
న్చుఁగడు న్నూధిగనమ్మ భాగవతుఁ డెందున్ఖేద మోదంబులం
దగులంబోవకసాక్షిమాత్రుఁడయియానందించునీభక్తిక
న్నగడింపన్భవవార్ధితారకమెదన్నా సూర్యనారాయణా॥ 63

శా॥ దీపంబెట్లిరులస్స్వరూపముగనెంతేఁ బ్రజ్వలింపించునో
నీపై భక్తియటుల్సదాత్మమయమున్వేఁజేయుఁగామాదులన్
హోపద్మాధిపవిత్యతృప్తికయునీధ్యానంబుదక్కన్యమ
ర్త్యోపాయంబినుమంతయుంబనికిరాదో సూర్యనారాయణా॥ 64

మ॥ సరిగా వేదములెల్ల రువ్వియును శాస్త్రంబుల్గడున్రోలియు
న్గురుబోధల్వివియున్ని జానుభవమున్శోధించియున్మర్త్యుఁడె
ల్లెఱుఁగున్నీదగునిత్యతత్త్వమహహాయెండన్గనంజాలునే
ధరనెందైననుగ్రుడ్డగూబపరమాత్మాసూర్యనారాయణా॥ 70

శా॥ నాకుంబ్రహ్మకభేదమంచుజగమున్గల్లించుఁబ్రాల్మాలిపే
రాకంటంబడిభిక్షమెత్తుకొనుసాహంకారికిన్మోక్షమె

ట్లోకష్టంబుగవ్యాససూత్రములగుంటుల్వెట్టివర్ణించనీ
యీకందంచినటియ్యమబ్బెటులటోసూర్యనారాయణా॥ 71

శా॥ ఊహాపోహలుశాస్త్రశోధనములున్యుర్తుక్రతుస్నానము
ల్సోహమ్మంచువచించుటల్వ్రతలుసత్యంబుందయన్నట్టియు
త్సాహంబొప్పఁగభక్తితోభవదుదంచన్నామసంకీర్తనం
బాహా సేయక మోక్షమబ్బెటులయ్యాసూర్యనారాయణా॥ 72

శా॥ ఏలావేయివిధాలయుక్తులిటులీవీలోకజాలంబుల
న్లీలంబన్నుచుఁబెంచుచుందుమముచున్ క్రీడించుచున్నావటం
చోలిన్నమ్మిత్వదీయపాదభజనంబొక్కింతయున్మాననన్
బాలన్మంచిననీళ్ళముంచినసరేనాసూర్యనారాయణా॥ 73

మ॥ ఒకవేళందనలోనలేనిజగమెంతోలీలకైపన్నిమా
మకమౌడెందమవస్థలెల్లఁబడుచుంబల్మాఱువేరొక్కవే
ళకుపిశ్చింతతనుండునీవునుమతాలాప్రపంచంబుఁద
ప్పకనీయందెతలంచియుందలఁపవప్పాసూర్యనారాయణా॥ 74

మ॥ ధరణింజీఁకటివేళదవ్వువెలుఁగుందర్శించుకందోయికి
న్మతియేవస్తువులైనఁదోఁచసటువిన్ ధ్యానించునవ్వానిక
ద్దిరయీలోకవికారముల్మదిరవంతేవింగనన్రావుగా
యరయంగాఁదనజీవితంబునమహాత్మాసూర్యనారాయణా॥ 75

మ॥ అమరన్నంగరునుండిదానిదగువాయస్వేరుసేయంగశ
క్యముకానట్టులవిజ్జగంబెడపరాదయ్యారెవిన్నుండిచ
క్రమునంగోణమురీతినారయఁగనీత్రైలోక్యమేపారినా
శమునీయందునఁజెందుచుండుఁబరమేశాసూర్యనారాయణా॥ 76

మ॥ స్థిరతన్పాత్వికభక్తిమార్గమునవిన్నేబింపఁగాలేనియా
నరుఁడెంతోజడుఁడైనశాస్త్రిచణుఁడైనన్లేదుకార్యంబహా

ధరనూహింపఁగ గ్రుడ్డికన్దెరచినన్దామూసికొన్నన్నరే
చరితార్థంబిసుమంతయుంగలుగదీశా సూర్యనారాయణా॥ 77

మ॥ అకటానీపయిభక్తియేభవహరంబంచున్గడున్రూఢిసే
యకమచ్చిత్తపుదేలతావకదురూహ్యాద్వైతతత్త్వంబుఁబూ
నికతోదంబలుమాఱెఱుంగుటకుయత్నించున్భుశీశక్తిలే
మికిశౌర్యంబుస్వభావసిద్ధమగుఁజుమ్మీసూర్యనారాయణా॥ 78

మ॥ జగతింగల్గుసమస్తచోద్యములఁగాంచన్బూనుఁడానెల్లవ
స్తుగుణంబుల్దెలియంగనెంచుమతియెంతోయష్టసంసిద్ధులం
బగలున్రాతిరిగోరుగానిమదిసర్వంఖల్విదంబ్రహ్మయ
న్పుఁగడున్శాంతివహింపదేలశ్రితబంధూసూర్యనారాయణా॥ 79

శా॥ అయ్యయ్యోభవశోకముందలఁచియెట్లాత్మస్థితిన్నిల్పుదు
న్వెయ్యేలాయిహభోగవాంఛవొడమన్వేదాంతమూఢున్గదా
యయ్యామానవుతెల్వివ్యర్థముసుమా యామూఁగనాల్కట్లున
న్నెయ్యంబొప్పఁగనెప్డుప్రోచెదవొతండ్రీసూర్యనారాయణా॥ 80

మ॥ భవదీయాంఘ్రిసరోజభక్త్యమృతముంబల్మాఱునాపించునా
కృపురావద్దనఁబొండ్లియన్నకులిదేలాశుష్కవేదాంతత
త్త్వవిచారంబుప్రతిక్షణంబుమదిలోఁబ్రాపించిపీడించెడి
స్పృహయందీప్సితవస్తువబ్బుటయుదబ్బోసూర్యనారాయణా॥ 81

శా॥ ద్వైతంబుంచుటయుక్తికాదుమతియద్వైతంబుప్రత్యక్షభా
వాతీతంబటునాసఁగర్మములుసేయన్మానరాదెంతయున్
ద్వైతాద్వైతసమంబుబ్రహ్మమనుచున్ధర్మంబువిర్మోహియై
ఖ్యాతిన్బల్కినవాఁడెయుత్తముఁడనంతాసూర్యనారాయణా॥ 82

మ॥ భళీ సేవనుకూలమైనయెడనాపజ్జన్మహావ్యాఘ్రము
న్నలినాలేగవలెంజెలంగుఁబ్రతికూలంబైనచోఁద్రాడుపెం

జిలువట్టుల్పయ పెట్టునన్నుమతీనీచిత్తానుసారంబుగా
విలసస్పష్టిస్థితినాశ ల్జురుగుఁదం|్రడీసూర్యనారాయణా॥ 83

మ॥ తృటియైనన్మదినీపయిన్నిలుపల్లేనేకాదశీనిష్టనె
న్నటికిన్సల్పఁగ లేనుదీర్ఘములమున్గల్లేవిఁకేపుణ్యసం
కటముల్నేఁబలేనుగావిభవశోకంబూడ్సరమ్మంచువి
న్నిటులఁబిగ్గరఁబిల్పుచుండెదనుదం|్రడీసూర్యనారాయణా॥ 84

శా॥ యుక్తింజెప్పఁగ లేనుగావిమతియెట్లోనీవజ|్రసంబున
దృక్తాధీఁడవై సమస్తజగదాధారుండవైయుంటివం
చుక్తుల్పెక్కులిఁకేలనమ్ముకొనినేనున్నాఁడనీవాఁడనా
సక్తిన్నన్నెటుచేపినన్పరియెయిాశాసూర్యనారాయణా॥ 85

మ॥ ఖశిరానాదగుపుట్టువున్మృతియున|్రపత్యక్షతన్లేవిఁక
న్గలయున్జాగరమున్నమానుభవమున్గన్పట్టుటన్వాస్తవం
బులుకావవ్విసుషుప్త్యవస్థనుమనంబుల్లీనమౌఁగాననా
కిలలోవన్ప|్రిమంతెవేరుస్థితియేదీసూర్యనారాయణా॥ 86

మ॥ |్రభమచేసర్వజగంబుగల్గినవివి|్రభాంతింగదాయంటేఁద
త్త్వమెఱుంగంబవిపూనుకొంటసహజోన్మాదంబహీనన్నుఁబో
లమహాపండితమావికిన్గనుకనీలోకంబునందుష్టిలే
శమున్వైనంగనఁజాలకుంటిఁబరమేశాసూర్యనారాయణా 88

శా॥ జ్ఞాతంబైనపదార్థతుల్యమగునజ్ఞాతంబుదోతేరఁద
ద్జ్ఞాత|్రపాప్యవికారమున్మతీతదజ్ఞాతంబునందోఁచుచే
ఖ్యాతి|్రప్తాతియనంబడున్గనుకజ్ఞేయజ్ఞానవిజ్ఞాతృత
త్త్వాతీతంబగుభూమమీవగుదువన్నాసూర్యనారాయణా॥ 88

మ॥ |్రకమతన్దేహబలంబుతగ్గుచునుశాఁగాఁదొంటిమాదిక్కివ్విభో
గములంబొందఁగలేకపాటుపడిసత్కర్మంబులన్సేయఁబో

కమలెల్లైననుగాఁ యాపనమఁగాక న్మెట్టవేదాంతవా
క్యములంబండితుఁడౌనుమాద్యృతుఁడనంతాసూర్యనారాయణా॥ 89

మ॥ క్షితియందున్న గవారలెల్లఁ బితలై స్త్రీలెల్లరున్మాతలై
మతిలోఁదక్కి నభూతసంచయములస్మత్ప్రాణతుల్యంబులై
సతతానందమునాకొసంగమతియుష్మత్పాదసంకీర్తనం
బతినిష్ఠామతి నేనొనర్చు టెపుడయ్యాసూర్యనారాయణా॥ 90

మ॥ తనువున్దెల్పియువృక్షబీజములవొంతన్పూర్వులసూక్ష్మక్రమం
బుననన్యోన్యముగారణంబులవుచుంబూర్వాపరావస్థల
న్దనరున్వస్తువిభేదమందకటుగానన్నేమనిత్యుండనై
కొనుచుంటిం బలుజన్మముల ప్రవసచక్షూసూర్యనారాయణా॥ 91

శా॥ అయ్యాయెక్కడనున్నవాఁడవనఁకంపాంభోధినీకీర్తనం
బయ్యాలోకులఁ వొఁగునట్లునలుపన్యత్నించునీదాసుం
న్నెయ్యంబొప్పఁగఁద్రోవకిట్టులుక్రమన్పెట్టంగనేలాత్వర
స్తయ్యాలించిప్రమోదమిమ్ముశ్రితబంధూసూర్యనారాయణా॥ 92

మ॥ అరయంగావిపరీతభంగివిమదిష్టానిష్టములూపెడున్
స్థిరతందుర్వ్యసనంబులవ్మిగులనన్బ్రేమిందుఃత్కర్మముం
దురహిన్వేసటగొల్పుచుండుమతిసంతుష్టిన్వడిన్దుబ్బన
ద్ధిరచిత్తంబనుకూలశత్రువిదెకాదేసూర్యనారాయణా॥ 93

మ॥ సులభాస్వాదనమెట్టులబ్బునిఁకనోర్పూచీబిలంబంతయా
కిలికొండంతనునట్టులాయువరయంగానల్పమిద్ధాత్రిలో
పంభోగేచ్ఛఘనంబుగావునరసాభాసంబుసంసారమం
న్బులలిన్భాబ్జ్ఞఁడెతింగిపిన్గొలుచుచుండున్సూర్యనారాయణా॥ 94

శా॥ పాముంజావదుకట్టియువిఱుఁగదన్యాస్త్రానుసారంబుగా
సామర్థ్యబునవస్తుశోధనయెతన్యంకాసమాధానము
ల్పీమఁబొందవుగానజ్ఞానమునఁదుష్టింజెందరాదెందున
న్స్వామీనీపదభక్తియోగమునఁదప్పన్సూర్యనారాయణా॥ 95

శా॥ నానేరంబులనైఁచినీసుభజనానందంబజస్రంబున
న్పూనంజేసిసమస్తలోకులనుసంతోషాంబుధిన్ముంచుస
ద్గానోద్యత్కవితాప్రభావమిడినన్గాపాడుచున్నావుగా
యేనీయప్పుఁకనెట్లుతీర్చఁగలనోరీసూర్యనారాయణా॥ 96

మ॥ కరుణంగంటికిఱెప్పపోలికననుంగాపాడుచున్నావునీ
బిరుదుంజెల్లునులోకబాంధవుఁడనీవేదేవదేవుండవం
చరహిన్నిన్భజియించుచున్నగతిలోనొంపారనీకీర్తిసు
స్థిరతంజాటెదఁబ్రాణమున్నవఱకున్శ్రీసూర్యనారాయణా॥ 97

శా॥ ఛాయోషాకమలాధినాయకనమస్కారంబునీకున్సదా
మేయాయంజలినీకువందనముస్వామీనీకుదండంబున
ద్ధేయానీకుజోహారపారకరుణాబ్ధీనీకుసాష్టాంగమో
హోయయ్యామఱినీకుమ్రొక్కెదిగొనీకోసూర్యనారాయణా॥ 98

శా॥ నీపైనెంతయుభక్తితోశతకమున్నేనీదయావాప్తిచే
నీపాఁతమ్మగియించియిప్పుడుత్రిలోకీశత్వముంబొందిన
ట్లోపద్మప్రియమేటిసంతసముతోనున్నాఁడనాతప్పుల
స్రేపున్మాపునసైఁచిప్రోవుననుఁదండ్రీసూర్యనారాయణా॥ 99

మ॥ వినువీక్షింపవికన్నుదోయిమఱియున్నీపూజలన్సేయఁజా
లవిహస్తంబులునీదువామమునుబల్కంబోవినోర్నీకుమ్రొ
క్కవిశీర్షంబు భవచ్చరిత్రసుధవేడ్కన్గ్రోలఁగాలేవివి
వ్కవినుంగొల్వవిజన్మమెందుకురతండ్రీసూర్యనారాయణా॥ 100

మ॥ ఆరయంగాసకలశ్రుతిస్మృతిపురాణాద్యర్థసారంబుఁబ
ల్మఱునాళ్ళక్తికొలందిఁజూచితుదకిమ్మైరూఢిఁగైకొంటిసం
సరణాంభోధిఁదరింపఁజేయుటకుయుష్మద్భక్తిదక్కన్యమీ
నరలోకంబునలేదుపాయమనియన్నాసూర్యనారాయణా॥ 101

ఆ. నారాయణదాసుఁడు.

శ్రీ గణేశాయ నమః

# మృత్యుంజయ శివశతకము

## కందములు

ఓనాథ దీనరక్షక
మానుగ మముఁ గావుమా యుమాప్రాణేశా
భానుశశివహ్ని వీక్షణ
జ్ఞానానందమయ మాకు జయములిడు శివా 1

పెక్కులు ప్రేలెదఁ బ్రతినలు
నొక్కటియున్నిలువ దాద హో పౌరుషవా
క్కెక్కడ నాబ్రతుకెక్కడ
నక్క దివితలా బనాఁగ నగజేశశివా 2

తప్పక యాపదకడ్డయి
విప్పగుకరుణారసంబు వెల్లిగొలిపి వి
న్గొప్పుం దాల్చినజగముల
యప్పా మముఁ బెద్దగావు మా సాంబశివా 3

నా బ్రతుకు జాటఁ బెంచిన
నీవాహ్వా నాదుతోడు నీతోడుసుమా
భావజగర్వ విభంజన
కావుము తడవేల నన్నుఁ గాచునెరశివా 4

విక్కము నీ వీశుండవు
దిక్కుగలిగి వేఁడుకొంటి దీనుండను నా
ప్రక్కం దో దలరించుము
మ్రొక్కెద నాకోర్కె దీర్పు మోసాంబశివా॥ 5

ప్రొద్దు భక్తితోడుత
నా పెద్దలు నేను విన్న నమ్మితిమిగదా
రావేల శేషకంకణ
కాపాడుము నాదుతోడు గల్గి భవ శివా॥ 6

ఇప్పటికిప్పటికే యో
యప్పా నీమీఁదశతక మలరించెదనీ
గొప్పయు దక్కుం గాచిన
విప్పాపి జగంబులోన నీశ భవ శివా॥ 7

నీకీర్తి చాటుకొనెదము
మాకాయుర్దాయవృద్ధి మతిమతిరానీ
రాకాశశాంకమౌళీ
ప్రాకటముగఁ దోడుచెలఁగి పాలించు శివా॥ 8

నీయెఱుఁగనట్టివున్నె
మాయిక్కటులు సర్వవేత్త మన్నించికృపన్
నాయున్నఁగాచి చూపుము
నీయున్నతభక్తరక్ష నిక్కమవిశివా 9

శంభో శంకర యని ని
న్నంభారవములగ నార్చు నాశ్రితులము క
ష్టాంభోధిఁ దేల్చుతండ్రీ
వింభావించితిమి యన్న నీవాడ శివా 10

యాచింపఁ దగినవాఁడవు
నీచులఁగొలిచియాడి నోరు నీచయ్యేఁగదా
నీచరితామృతమున నా
వాచవిదీఱఁగవలయుఁ బరమేశ శివా 11

ముదమున నాతోఁదలఁచఁగఁ
బదిలముగా వేగమమ్ముఁ బాలించుము నీ
పెద మబ్బులింగఁడవుగా
పదపడి పెక్కేండ్లుమమ్ముఁ బ్రతికించు శివా 12

ఊరులు పల్లెలు వారులు
చీరలు మఱిసకలమైన సిరులివి మేలా
యారూఢిగఁ జిరకాలము
నీరూపముఁజూచుకోర్కె నెగడించు శివా 13

లోకములోనా సొగసులు
నీ కరుణంగాదె యెంత నేర్పరివౌరా
శ్రీకంఠభక్త రక్షణ
కై కాలానలము బ్రమింగఁ గల్గితివి శివా 14

ఈదొంగ దాసునియెడ
న్నీదయగన్పర్చు తోడు నీడ వెలుంగన్
నీదివ్యగాన మహిమన్
బోదోలుదు వ్యాధిబాధ భూతపతి శివా 15

అకటా యార్తుండఖిన్నుండ
నొకించుకయు నీదుకరుణ నొందిబ్రతుకుకై
వికలదశఁబల్కు చుంటిని
సకలేశ్వర మాకుహాయి సల్పుముర శివా 16

శరణమని నీదుపావన
చరణంబుల నాశ్రయించు జంటన్నమ్మన్
గరుణించు దెబ్బదేఁడులు
ధరణిన్నికీర్తి విల్పెఁచము సాంబ శివా॥ 17

మృత్యుంజయుండనని వి
న్నిత్యము శ్రుతిచాటుచుండ విక్కటఁబేనిన్
అత్యనుకూల వినాయువు
సత్యంబుగ నీకుభక్తు జంటనిడు శివా 18

శ్రుతి మతి గతి నేనెఱుఁగను
గతినీవే యనుచు నెటులో కావ్పించెను నా
బ్రతుకును జంటందోడువి
రతముంగాపాడి మీఁది రక్తిఁగను శివా 19

జోడుగఁ దోడుగ నీడగ
వేఁడుకతో శ్రుతుల మేళ వించుచు నిన్నుం
బాడి కనిడీర్పుకొందుము
వేఁడెదమాజంటఁబెంచు పెక్కేండ్లు శివా। 20

మృత్యుంజయత్వ విభవము
విత్యుఁడఁవౌ నీక్షిదక్క నేమందెదమా
సత్యస్వరూప శంకర
గత్యనుకూలతనుఁజూపి కాపాడు శివా। 21

అన్నియుఁ దెలిసినజాణవు
పన్నగముల నగలదాల్చు వైభవుఁడవు వి
త్యోన్నతి మృత్యుంజయుఁడవు
కన్నారం జిరము మమ్ముఁ గావుము శివా॥ 22

ఒక ధైర్యము మాత్రమె తా
వక సేవకులందుఁ గలదు బహువత్సరము
ల్పకరంబుగ నింబాడుట
కిఁక దీర్ఘాయువులఁ జేయు మీశ భవ శివా॥ 23

వాక్కులు వ్రాతలు సఫలమొ
విక్కమొ! యిప్పకమొ నీవె నిర్ణయపరచన్
జక్కనను భయమునన్నా
ప్రక్కనుఁ గాపాడు నిన్ను భావింతు శివా॥ 24

నాకోర్కెఁ దీర్చనియెడ
న్నాకుండిన వెఱ్ఱితెంపు నన్నుస్వను నే
వాకుందెఱువను మూఁగటు
నీకీర్తన సొంపు లొరులు నేర్పుదురె శివా॥ 25

హరహర శంభూ శంకర
దురితవిదూరా స్వభక్త దుఃఖవిదారా
కరుణాకర మృత్యుంజయ
పరిపాలన సేయుమన్న ప్రాణహిత శివా॥ 26

లోకులకుఁ దెలుపనోడిన
నాకుండిన పాపచింత నవ్వేదహోయా
లీకలము నొరులు గనలే
రాకులపాటేలకావు మన్నభవ శివా। 27

నీవెఱుఁగుదైన మూఢుఁడ
నేవెరువునఁ దెలుపుకొందు నీకుఁడవగుటన్
గావుముతోడలంన్నె
జీవించినవఱకుఁ జంటఁ జేపట్టు శివా। 28

కొన్నాళ్ళు దేహ మావల
విన్నాఁతియు భోగవాంఛ నేముబ్రతికిహో
యిన్నింబాదెడుఁ జంటకుఁ
బన్నుగ దీర్ఘాయువిచ్చి పాలించు శివా 29

నాకోర్కె నీదురక్షణ
యేకమనుచు నెఱుకచెప్పి యెల్లజగములున్
నాకవిత శరణుజొరఁగా
మాకష్టము దున్మి చిరము మన్నించు శివా 30

ఆశ్రితులను నీ కీర్తన
కేశ్రమప్రాణంబులనక యెల్ల దెసలు రా
గాశ్రితములు గాఁగవగా
మిశ్రిలయలఁబాడఁజిరము మెలఁగించు శివా 31

నీ కీర్తన సేయునెడన్
లోకుల కాశ్చర్య మొదవ శ్లోకములంగీ
తాకృతులు పాడు జంటన్
శ్రీకంఠాభక్తరక్ష చేపట్టు శివా! 32

కన్నీరందవి శోకము
నన్నిట్టులముంచనీకు నాగవిభూషా
కన్నారఁ గావుమన్నం
బన్నిగ నెనరుంచుమన్న పాలించు శివా! 33

ఇదియొక వెఱ్ఱిగ వ్రానెద
మదికిన్ ధృతికొంతకొంత మఱపుభయముతో
నిదురయనక నిటలాక్ష
సదయుఁడవై కావుమన్న సర్వేశ శివా! 34

నాదీక్ష నేటిరాతిరి
నీదయచేఁ గష్టమెడసి నేముసుఖమునన్
పై దోడు జంటఁబెక్కెం
డ్లాదుకొన నృపథ మిదిగొ యాలించు శివా॥ 35

నీప్రాపు చని యెఱింగిన
నేపామరుఁడై నఁగావి యె ట్టిల మఱచున్
గాపాడఁగ నిర్బంధనఁ
జేపట్టి నినుం జిరాకు నేయకయె శివా॥ 36

రక్షించుము రక్షించుము
రక్షించుము నీధుదాసు అవ్వనిదకు ఫా
లాక్ష లోకాధ్యక్షా
అక్షీణకటాక్ష బ్రోవు మన్నభవ శివా॥ 37

నీకన్న న్యాయకర్తలు
నాకన్నను దుష్టమతియు నహియని చాటన్
నీకీర్తిం జిరకాలముఁ
బ్రాఁకింపఁగఁ గోరితన్న పాలించు శివా 38

కలమా కన్నీరోడ్చకు
మనభక్తపరాయణుండు మనవిభుఁడభవుం
డిల నీకష్ట మెఱిఁగి కో
ర్కెలదేవుం డిడును జెల్లరే వెఱ్ఱి శివా॥ 39

నాలోపల నావెలుపల
నీలావణ్యంబులేక నీభక్తి యెటుల్
జాలింగొని మృత్యుంజయ
పాలించఁగదన్న ప్రాణ బంధుఁడవుశివా 40

బ్రతుకులు నతుకులు బితుకులు
చతురతనింగూర్చిపాడఁ జాలినమాకున్
బ్రతిలేకయె చిరకాలము
బ్రతికించుమయన్న ప్రాణ బంధుఁడవు శివా॥ 41

ఇదినిజమౌ మాయామా
పదలో నీస్మరణగల్గి పఱపఱ వ్రాయన్
బదపడి నీపాటలతో
ముదమునఁ బెక్కేండ్లుఱుకు మోయన్న శివా॥ 42

ముజ్జగముల గల సంపద
గజ్జివలెండలఁచి నీచకామసుఖములన్
బొజ్జ లటర నిన్ బాడెద
మజ్జరె మాయన్న గాఁవు మాయన్న శివా॥ 43

ఆహాధైర్యముతోడగు
నోహో నీదయయువచ్చు నోజగదీశా
సాహసమువ విటులుంటిన
యోహర కాపాడుమన్న యోసాంబ శివా॥ 44

తెలివెంగుత్సిత భోగము
లిలలో నీపాతభజన మెంతోపెక్కేఁ
డులు జంటఁబాయకుండెద
నలరించుము నన్నుఁదీయ నన్నలవ శివా॥ 45

శారదశీతాతపహా
సారపిచంద్రానలాక్ష చారుజటాజూ
టారోధితదివ్యధునీ
పూరయశస్సాంద్ర బ్రోవు మోసాంబ శివా॥ 46

సాక్షాత్కరించితన్నా
రక్షించితివన్న మంచి రసికుఁడవన్నా
యాక్షణము తెలియనీ నా
పక్షము నీవుంటివంచు భక్తులకు శివా॥ 47

స్ఫాటిక విర్మలినాకృతి
మేటిదయన్దాసుఁ బ్రోచు మిన్నదనంబున్
నేటికిమాకష్టములను
మీటిన వినుఁగంటినన్న మేలిడిన శివా॥ 48

రాదు నిరూపింపఁగ నే
మో తెలుపును చక్కఁదనము లొల్కెడు నీసం
పాదితసుందర రూపము
సాధుల రక్షించుమన్న సర్వేశ శివా॥ 49

ముమ్మాటికి నీపదముల
నమ్మితి నమ్మితి విఁకెట్లు నంగాచెదవో
సుమ్మా నీభక్తులమన
నిమ్మానీ కీర్తిచాట వి మ్మోర శివా॥ 50

శతకోటి మదనరూపా
శ్రితజనహృద్దీప ప్రకట శేషకలాపా
అతివేగము నీ భక్తులఁ
జతురతగాఁబ్రోవుమన్న సాంబభవ శివా॥ 51

సమయమిది మమ్ముఁబ్రోవన్
క్రమముగ నీ సంశ్రితానురాగముతోడన్
శ్రమవాపి వేగఁదంద్రీ
విమలాకారంబుఁజూపి వేంచేయు శివా॥ 52

ఇప్పుడు నాదగు కోరిక
చొప్పున మమ్ముద్ధరించి చూడుము దయతో
నప్పా సంశ్రిత బంధుఁడ
విప్పగు నెనరుంచి వేగ వేంచేయు శివా॥ 53

నా యీ విన్నపు వ్రాఁతలు
నీ యట్టి మహాత్మ్మమనసునేఁ గరఁగింపన్
దాయ బెటు లెక్కటా వేం
చేయుము నా యన్నఁ బ్రోవ శ్రీకంఠ శివా। 54

వలపుందలపున్నీపయి
నిలిపితి సందియములేదు నిక్కంబుగ మం
దులమారివేల్పు వౌదువు
కలనైనం బరులనమ్మఁగాఁబోను శివా॥ 55

భయములకు నెల్లనెక్కుఁడు
భయమౌ మరణంబు దానిఁ బాపఁగలనునీ
దయ మా యెడఁ గలదేని స
మయమిది వేఁగావుమన్న మదనారి శివా! 56

నీ దిక్కు దప్పదాసుని
కేదిక్కుంగానరాద దెంత వెదకినన్
వాదేల ప్రోవుమన్న మ
హోదార చరిత్రవేగ నోసాంబ శివా॥ 57

మృత్యుంజయ మృత్యుంజయ
మృత్యుంజయ యనుచు విన్న నెప్పుడు గొల్వన్
మృత్యువు చేరఁగ వెఱచును
సత్యము గాపాడుమన్న సాంబభవ శివా। 58

నీకునసాధ్యం బెయ్యది
లోకములో లేదటంచు రూఢిగఁ దోఁచెన్
శ్రీకంఠ కావుమన్నద
యాకర వేవేగఁ బ్రోవు మా సాంబ శివా॥ 58

నీ భక్తికన్న నెక్కువ
యీ భువిలో సుఖములేవ దహీనకలాపా
నీ భవ్యదర్శనంబిడి
మాభయములఁ గొట్టి చిరము మన్నించు శివా॥ 60

అద్దిర ముజ్జగములకున్
ముద్దువలపు మగఁడ వీవు పురహర యనుచున్
దద్దయుఁ బాడెదుఁ జంటన్
సద్దయఁ జిరకాలముంచు సర్వేశ శివా॥ 61

ఇహ సుఖము దూలవంటిది
మహాత్మ నీభజనకన్న మఱియానందం
బహహా యెందుండోఁచదు
దహన రవిశశిక మమ్ము దయఁజూఁడు శివా॥ 62

ఎంతో నాసవడితి నా
వంతయు ధృతిచెడకయుంటి నాలస్యంబున్
సుంతయుఁజేయక దాసుని
పంతంబీడేర్చుమన్న బ్రతికించు శివా॥ 63

నగమిచ్చినావు తక్కిన
సగ మాయుర్దాయమిచ్చి జగమందున నీ
యగణితకీర్తి నలరఁగ
మొగమోటంబుంచి బ్రోవు మోయన్న శివా॥ 64

భోగములఁ గోరనొల్లము
భోగీశ్వర భూష బ్రతుకుఁ బొడిగించినచో
నీ గానము సంతుష్టిగ
బాగుగఁ బ్రకటింపనాస పడితిమిర శివా॥ 65

నాతరమ నిన్నెఱుంగన్
జేతోభవగర్వభంగ శ్రీముఖలింగా
యేతీరునఁ గాపాడెదొ
నాతోడలరించు ప్రాణ నాథభవ శివా। 66

హాలాహలభక్షణ మా
పాలన్వి బాధికతను బాపుము త్వరగా
జాలింగొని కాపాడుము
బాలేందువతంస యన్నఁ బాలించు శివా। 67

నే బ్రతికిన సార్థకమే
మీబుజములు కాళ్ళు కనులు మెడ లేనట్లో
నా బ్రతుకు జంటనలరం
గాఁ బ్రోచిన నిన్నుఁబాడి కడఁగందు శివా। 68

జతజంట వేఱుపాయక
బ్రతుకున నాతోడునీడ బలపడమమ్మున్
జతురత నీభజనంగన
శ్రుతిగాఁ గాపాడుమన్న శూలధర శివా॥ 69

బతిమాలుకొందుఁ దండ్రీ
క్షితిలో నీపేరు మిగులఁ జెప్పెదనన్నా
జతఁబెంచి పెద్దకాలము
శితికంఠా వేగ మమ్ముఁ జేపట్టు శివా॥ 70

హరహర యెట్టికవితయో
మఱిమఱి నాలోనికోర్కి మనవియొనర్పన్
గఱకఱకలమున నేడ్చెదుఁ
బఱపఱ నాపదలఁ గోసి బ్రతికించు శివా। 71

అన్నియుఁ జిత్తులు బిత్తులు
కన్నులఁ బడుచుండెఁ దప్పు గావుము నాకున్
నిన్నుం బతిమాలుట పవి
పన్నగకేయూర మమ్ముఁ బాలించు శివా॥ 72

ఏదిర నీ కుండినయా
యౌదార్యము శాంభవీమనోంబుజమిత్రా
కాదన నేలర తండ్రీ
మోదముతో మమ్ముఁ బ్రోవుమో సాంబశివా 73

అన్నా యుమామనోహర
కన్నార న్నమ్ముఁగావు కాయజవైరీ
నిన్నుంబతిమాలెద నా
యన్న ముదముతోడఁ బ్రోవుమా సాంబశివా 74

పరిపరివిధముల నెమ్మది
పరువెత్తెఁడు నిన్ను వేఁడ బ్రాయునెడన్నా
తరమ విను విల్వఁబుట్టన్
వరమిమ్మన్న మఱిహోయిఁ బ్రతికించుశివా 75

తాఁగోతి మఱియు మత్తిలె
నాఁగ న్ననుబోఁటి వెట్టి నవ్వగనేలా
వేగంబంట నలర్చుము
నాగేంద్రవిభూషకావు నాన్నభవశివా 76

హరహర మృత్యుంజయ యో
పరిపూర్ణానందముక్తి పై భవకందా
నిరసించక కవఁబెంచుము
నరిసరి నీవిషముమత్తు చాలునిఁకశివా 77

అలికిఁ గోఁకలుగొంటయె
యాఁకి నుపకారమంట యోహోచాలుఁన్
దారార్థ తనూభోగము
రారా నాయన్నఁ బ్రోవరా సాంబశివా 78

దేవతల కెల్లనీవే
దేవుఁడవో కాలకా స్త త్రిజగత్ప్రభువా
నీవంటి వాని నమ్మిన
నేవెఱపిఁక నన్నఁ బ్రోవవే సాంబశివా 79

ధైర్యము దక్కఁతి ముక్కఁతి
శౌర్యంబెడఁబాపె నీదు సేవకుఁదప్పన్
భావింపనన్య మెయ్యది
సేవలు చిగురించుమన్న శ్రీకంఠశివా 80

కావని కాకులపోలిక
నీబత్తులు సేవదొఱఁగి విన్నొఱఁబెట్టన్
భావించుమన్న కవతో
నా బ్రతికుం బెంచుమన్న నగజేశశివా 81

నీవొకఁడు నేనొకఁడునై
భావనలో బ్రాంతలోనఁ బాటలలోనన్
సేవల మైత్రింబొందఁగఁ
బ్రోవుము నాయన్నమంచి ప్రోదవుర శివా 82

ఎంగిలి మాటల నేవి
న్నుం గొనియాడుటకు వ్రాయ నో ర్వెగలింపన్
వెంగలిని సిగ్గుబొందన
నంగజమద భేది కావు మన్నభవ శివా 83

ఈనగల నీ చమత్కృతు
లేనమ్మను విన్ననమ్మ యేమఁటకానీ
రావిమ్మనీకృపా మతి
తోనాయన్ననను౯గావు దొడ్డయ్య శివా 84

అమ్మగిరి రాజసుతగీ
తమ్ముల నామనవి వినిము దమ్మనఁజిరకా
లమ్మనిచి మమ్ముఁబెంచఁగ
నెమ్మది గరఁగించుఁగాత నీ కోరి శివా 85

దీనునిపైఁ గనికారము
మానివి రాచూలి సర్వ మంగళపూ పన్
దాఁనాడు తల్లియగుటన్
గానమ్మనఁ జాటిచెప్పఁ గా నీకు శివా 86

జాలిగొను తల్లిపార్వతి
యాలించుము జగముగన్న యమ్మాస్థాణున్
మేలుకొలిపి మాజంటన్
బాలింపంబంపుమనెద ఁబాడెదను శివా 87

మానమ్మ వేల్పుప్రోడా
మానుగమాకవనుగావు మాచెలికాఁడా
జ్ఞానానంద మయాదే
వా నాయన్న ననుఁగావు పరమేశ శివా 88

పంచాస్త్ర గర్వభంజన
చంచద్దేహార్థరమ్య సత్యాకారా
పెంచుము పెంచుముకవఁబా
లించుము రాయన్న దివ్య లింగభవ శివా 89

గడునదనము గాదిది నీ
యడుగులఁబడి వేఁడుకొన్న యాశ్రితులము మా
యిడుమ లెడపి కవఁ బ్రోవుము
పడివడి మా యన్న ప్రోచి బ్రతికించు శివా 90

నా ధైర్యమన్న పాయిగ
నీదయతోఁ బెక్కులేండ్లు నిల్చెదమంచున్
ఓ దేవ దేవ మాతో
డై దీర్ఘాయువుగనన్న యలరించు శివా 91

నిర్భయమని తోఁచెను నీ
యర్భకునకు జంటపాయి యౌ బ్రతుకంచున్
దుర్భర బాధలు తెగవా
నిర్భవము భావమందు వెలసితివి శివా 92

అన్యములఁ దలఁప మేమ
న్యోన్యముగా జంటఁ బ్రోచి తొళంకవడన్
మాన్యతను బెద్దకాలము
ధన్యులుగా నుండుమన్న దయజూడు శివా 93

ఇదివిరుదు నీకు భక్తుల
సదయత రక్షించినావు శంకరుఁడవుగా
పదునాల్గు భువనములలోఁ
బదపడి చాటుదు నీకన్న బ్రతికించు శివా 94

ఎంతటి చలచిత్తుఁడనో
పంతముతో నొక్కమొగినిఁ బద్యశతంబున్
గంతునరచించ కుంటిన్
వంతఁదొలఁగఁ బ్రోవుమన్న పశుపాల శివా 95

సత్యము నీదగురక్షణ
సత్యము నీభక్తులెల్ల సౌఖ్యముగొంటల్
సత్యం బీశతకంబని
సత్యతనాయన్నఁ బ్రోవు సర్వేశ శివా 96

నీభక్తి గర్వవశతన్
నాభాగ్యము పండెఁ బెంచు నాయన్నమహో
ప్రాభవమొప్పఁగఁ దిరిగెద
నీభువిఁ బెక్కేండ్లు కీర్తి విల్వమురశివా 97

తంబుర మద్దెల తాళము
లిమ్ముగఁ గవగూర్చి శ్రుతుల నేముదశదిశల్
ఘుమ్మనఁ బాడగ వాయువు
లిమ్మా చిరకాలమన్న యేపలర శివా 98

విశ్వవనుజుమ్మీ నీదగు
నడుగులపై భక్తి సమయ మబ్బినచో నా
కడ నీవు డకతీజుదు
కడువడి మాయన్నఁ బ్రోవఁగా రమ్మా శివా 99

శివశివ శివమృత్యుంజయ
భవభవ భవపాపదూర భక్తాధారా
కవగా మముఁ గాపాడుము
భువిలోఁ బెక్కేండ్లు మమ్ముఁ బోషించు శివా 100

శ్రీమృత్యుంజయ శివశతకము
సంపూర్ణము.

శ్రీరస్తు

శా॥ శ్రీదామాంచిత పీనవక్ష సిత రాజీవాక్ష నిశ్శ్రేయసా
ధారా పాపవిదూర వేదమయ దైత్యధ్వాంత సూర్యోదయా।
కారుణ్యామృత పూర చక్రధర భక్తప్రాణసంరక్షణా।
పారావారగభీర ఘాతకర దేవా సత్యనారాయణా.

# ముకుందశతకము



కందములర్పించెద మా
కందరసానూన మధుర కవితాసుధ్ధనీ
కందముగా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా. 1

సందియమేలా సౌఖ్యము
లందింపుము సంకటముల నడఁగింపుమువే
గం దయతో నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 2

ముందె రుచిమరగినాఁడను
బొందుగ నీభక్తి యిష్టములిశఁగ నింకే
సందియమో నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 3

డెందముఁగుందగ నీకు ప
సందుగ సంతోషపరచి సన్నుతి వినుమా
మందరధర నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 4

కందింపకు నా చిత్తం
బిందిరపై వలపుదలంచి యిష్టార్థ సుఖం
బందింపుము నారాయణ
కందళితానందమూల కంద ముకుందా! 5

మం దఖిలరోగములకున్
విందుమదికి నీదు భక్తి విద్దెలకెల్లన్
నందగునో నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 6

ఇందందెందైన సుఖం
బందఁగ నీభక్తియే యు పాయంబగుని
ప్పందేహము నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 7

బందంబులు పాపంబుల
కందంబులు వీనులకన యము నీదుకథా
బృందము లో నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 8

ముందెఱుఁగని మందుఁడ నా
చందముఁదలపోసి కష్ట సమయములంగే
లందిమ్మా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా! 9

వందెము వేసెద భక్తుల
కుందప్పు మఱెట్టి యోచల కున్నిందెలియం
గందరమా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 10

కుందింపకు నన్ శ్రితహరి
చందన నీ నవ్వులాట చాలించుము ప్రో
వందగురా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 11

ఎందుకురా యాలస్యము
పెందలఁగరుణించి నీదు ప్రియదాసులఁ గా
వందగురా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 12

అందితివి చేలి కింకీ
వెందేగెదవోరి కోర్కెలి డక విసువ నిన్
దొందరపడు నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 13

ఆందము లకుప్ప నన్నుఁబ
సందుగ దయఁగనక పొద్దు జరుపుట గొప్పా
యెందప్పా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 14

పొందుము మొగమోటము మా
యందిపుడు సదా భవత్ప దాశ్రితులము గో
విందుండా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 15

ఆందముగఁ గాచితివి ని
స్సందేహంబయ్యె నిపుడు చల్లని తండ్రీ
వందనమిదె నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 16

అందఱికి నీవు శ్రితజన
మందారుఁడవైన మంచి మర్మము మహిలో
విందొనరుతు నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 17

డెందంబింతకు హాయిన్
బొందెను నీకరుణ విన్నఁ బోలు ప్రభువెటన్
గందుమరా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 18

పొందుగ మమ్మిటు పోషించిన
యందుకు నీ ఋణముదీర్ప నలవియె మా కో
నందకధర నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 19

సుందర పదారవిందా
వందితముచికుంద ముదిత నందా భృతగో
బృందా యో నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 20

కొందలపాటింకను మా
కెందుకు సల్పెదవు త్రిజగ దీశ్వర తండ్రీ
కుందింపకు నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 21

సందియము మళ్లి డెందము
పొందుచుడిందుపడి మిగులఁ బొగలెడు నిన్నే
మందుమరా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 22

డెందమున హాయి గాఁదిర
మొందక దోఁబూచి చూపు చుంటివి నీకే
సందియమో నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 23

ఇందలి కష్టము దు్రించి మ
ముందయఁ బెక్కేఁడులుంచి పోషించుము మా
ముందుందుము నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 24

ముందు కరిరాజు నేలిన
దందఱు నమ్మికొనునట్టు లలరించుము మ
మ్మెంతయతో నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 52

ఇందాఁక నుంటి వెదలో
నెందేగితి వింతలోన నీశ్వర విన్న
ట్టందరమా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 26

ఇందందు వెదకి డస్సితి
ముందలనున్నట్లె నీవు మొఱగి చనితివీ
వెందుంటివి నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 27

మందరధర రారా శ్రిత
మందారా రార పాప మర్దన రా గో
విందా రా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 28

ఎందేగి నావు తండ్రి
ముందలఁ నగపడవ నాదు మొఱవినవా నీ
కుందగునా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 29

సందులు గొందులఁ దూఱుట
పందతనము విన్ను బయలు పర్తు నిదిగో మీ
సందువ్రీతి నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 30

పొందుగ నీవుండవి తా
వెందున్నది నీవుకాపి దేదీనాపి
ల్పొందవురా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 31

కందర్ప కోటిరూపా
సుందరకౌస్తుభకలాప సూరిజన మన
స్పందీపా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 32

డెందమలరె నీవో య
న్నందుకు నాకభయమిచ్చి తద్దీచెవికి
వ్విందయ్యేర నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 33

డెందము గుఱ్ఱిడఁజాల ద
దెందుండి పలుకుచునుంటి వీశ్వర చెపుమా
పొందుగనో నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 34

విందుగ నీశంఖధ్వని
బొందుగ జేరుపవనెవింటి మోదముతో నా
ముందగపడు నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 35

డెందంబుప్పొంగెను నా
బొంది పులకరించెఁ గనుల మోదాశ్రువులిం
పొందెనురా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 36

సుందరనభోవినీలా
యిందగపడినావ సుజన హృదయవిలోలా
వందనమిదె నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 37

యెందెట్టివారలైన
నిందెలిసి నుతింపఁగలర నిర్గుణుఁడా నా
కుందరమా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 38

సుందర పదారవింద
స్యందామృత పానమత్త సజ్జనచిత్తేం
దిందిరగణ నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 39

మందీకృత భవతాపా
బందీకృత సర్వపాప భక్తామల హృ
త్పందీపా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 40

కందర్పకోటి సుందర
కుందస్మిత శార్ఙ్గచాప కోర్కెలలర నా
ముందుంటివ నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 41

డెందము నీపదపద్మము
రందమ్ముంగ్రోలి సుఖప రంపరలెప్డున్
బొందునురా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 42

నందిత సమస్త సంశ్రిత
బృందా నీభక్తిలేవి యిహభోగము వొ
ల్లందునురా నారాయిణ
కందళితానందమూల కంద ముకుందా। 43

పొందుగ నాకువలయు దా
నిందెలియుదు వీవెకావి నేనెఱుఁగను సూ
ర్యేందునయన నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 44

డెందమెఱుఁగని కొఱఁతగల
దందుకు గుందెదను దెల్పు మదియేదో గో
విందుండా నారాయణ
కందళితానందమూల కంద ముకుందా॥ 45

ఇందలి లౌకికదంభము
లందున నా మనసునిల్ప కనవరతము విన్
బెందించుము నారాయణ
కంధళితానందమూల కంద ముకుందా॥ 46

ఎందేవియు నజ్ఞానము
నందొల్లెడు మూఢమతు లనాక మమ్ము గా
వందగురా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 47

సందడితో వ్రాయుచుఁగల
ముం దిగువనుబెట్టి వెదుకఁ బోవ దొరక న
ల్లిందేగితొ నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 48

ముందుండి నీవెమాయన్
జెందిన లోకంబుమాట చెప్పవలెనె యే
మందునురా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 49

అందముగ నింతవఱకున్
ముందుండియు మాఱుపల్కఁ బోవక మాయన్
బొందెదవా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా। 50

అందమ్ముగ నిన్ను నెదం
బందెలు పడవైవకున్న మార్చేరన్ ఓ
ల్యందగునను నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 51

డెందపు కోర్కెలుఁగక పసి
కం దేకువఁ గాచు తల్లి కరణి నమం గా
వందగురా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 52

డెందమును తర్క తత్త్వము
జెందింపక విన్న విశ్వసించు మతము నా
కందించుము నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 53

ముందుంటి వింతవఱకి
ట్లెందేగితొ శాశ్వతుండ విట్లస్థిరతన్
బొందెదవా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 54

డెందమున భేదమేలా
కిందే మీందన్న యటుసరిగనీవే నే
నందునురా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 55

డెందమున జగద్భ్రమ లయ
మందినపుడు మిగిలినట్టి యవ్యక్తమె నీ
వందునురా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 56

ఎందుంజగద్భ్రమము నేం
జెందెద నేననంగ నేమొచెప్పుము మఱినీ
చందంబో నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 57

సందియమూడ్చి జగద్భ్రమం
జెందింపక నీదుభక్తి స్థిరముగ నన్నుం గా
వందగురా నారాయణ
కందళితానందమూలకంధ ముకుందా॥ 58

అందించు న్వేదాంతము
విందు గాఁగ నీకునా కభేదమనుచు విం
కెందుకువెత! నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 59

అందముగ నీవునేనొక
చందమయిన నీదు సత్య సంకల్పమునా
యందేదీ నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 60

ఇందేమి లేదు రుచి గో
విందా! నాకేల మెట్ట వేదాంతము నా
ముందగపడు నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 61

ఇందందన్నిటి కర్తవు
పొందుగ నీవలననెల్ల పోఁడుములగు ని
న్నందేహము నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 62

ఎందెందు వెదకినన్నీ
వుందు వెదియు గాక యింతయు నీమాయా
స్పందనమో నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 63

ఇందెల్ల ప్రాణులకు గతి
సందర్భముఁ జూపి దావి జాడన్ ఫలముల్
పొందింతువు నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 64

సందియములేదు విన్నుఁ బ
సందుగ భజియించు భక్త జనము లమృతమున్
బొందెదరో నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 65

డెందమున విన్ను నమ్మవి
పందలకున్గుర్తు చూపు స్వాతంత్ర్యము నా
కందింపుము నారాయణఁ
కందళితానందమూలకంద ముకుందా॥ 66

ఆఁదియు నందవియటు న
న్నెందుకు మోసంబుజేసె దీశ్వర పరిగా
ముందగపడు నారాయణఁ
కందళితానందమూలకంద ముకుందా॥ 67

పొందుగ నీభక్తుఁడెజగ
మందున సర్వస్వతంత్రుఁడవి దృష్టాంతం
బుందెలుపుము నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 68

ముందు నను ద్రోవకున్నన్
బెందుల నీపరువు బయటఁ బెట్టెద నాతో
గందుమా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 69

ఎందుకు మముఁ గల్పించెద
వెందుకు మూఢత్వమిచ్చి యేఁచెదవీవె
ట్లెందుకురా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 70

కుందవు పొంగవు సుంతయు
నిందకయిన స్తుతికినైన నెఱమొందివి యే
మందునురా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 71

ఎందైన(గూ)రబుద్ధిని
ముందుగనీ పెంచు జీవముల నీవే చం
పందగునా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 72

నం దెలియ కిట్లు నామది
కందించెద వెద్దపుందు కాకికి నొగులా
యెందైనన్ నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 73

ఎందు కసమానకషలు
మందు(డనాకేల పెంకె మాటలు నామీ
దం దయగొను నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 74

కొందలమందెడు దాసుని
ముందల గనుపించి యభయమున్ గృపతో(బె
ట్టందగురా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 75

మందులమారివి నీ దెస
దెందముటుల భ్రిమము జెందె డి వ్విధువక పో
వందగురా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 76

ఎందేనెట్టులఁగానీ
పొందుగ నీభక్తి విడువఁ బోవను నీతో
డందుసురా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 77

మందెట్టులనో పసితన
మందే నీభక్తి పొడమె బాగుగనది వి
ల్బందగురా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 78

ఇందలి పాపప్రవృత్తుల
నం దొర్లించక విరాన నమ్మకమిడి బో్రి
వందగురా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 79

విందెలియరాదు మఱినా
డెందము నీయుక్కి నమ్మెడిన్ దానిది ని
ష్పందేహము నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 80

ఎందుంటి వెట్టులుంటివి
సందేహము మాప్పినాదు సరసకురా స
ద్బృందావన నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 81

డెందము సుంతయుఁగరఁగద
డెందుకురా యిట్టు లేడిపించుట తగునా
ముం దగపడు నారాయణ
కందళితానందమూలకంచ ముకుందా॥ 28

బంధె లిడెద నిను నెదవిడె
పందెము నీకంటె మొండి వాఁడనురా గో
విందుండా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 83

పొందుగ జలముల డాఁగినఁ
బందివయిన నెట్టివికృతి బరఁగిన నినులోఁ
గొందునురా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 84

ఎందేగఁగలవు నామది
కందక నీమాయలెల్ల యాఅడిగానిన్
జెందెదరా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 85

ఇందాఁక సహించితి నిక
ముందోర్వన్నిన్ను దండమున సాధింతున్
దుందుడుకా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 86

దెందమునొచ్చి యిటంటిన్
బొందుగ నాతప్పు సైచి ప్రోవుము తండ్రి
తొందరపడు నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 87

ఎందుకు సిద్ధునొప్పందన్
బంద న్నిమ గుడ్డు పిల్ల భ్రమయించినటుల్
విందించితి నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 88

ఎందుకు దెందము మఱిమఱి
విందర్శించియును దోల్చ నేఱక మఱపున్
జెందుసురా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 89

ముందెఱుఁగ విన్నెనెదఁ గ
న్నందున నిహమెల్ల కల్ల యని బూటకమం
చుం దెలిసెను నారాయణ
కందళితానందమూలకంత ముకుందా॥ 90

ఎందైన నీకటాక్షం
బందక నాయంతనిన్ను నరయఁదరమ గో
విందుండా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 91

పెందలకడఁ బ్రజ్ఞానము
జెందించుము నీదుభక్తి స్థిరపర్చుము నం
క్రిందనమత నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 92

దెందమ్మున దుర్గర్వము
పొందించకు భూతదయను బొదలించుము నీ
ముందుంచుము నారాయణ
కందళితానందమూలకంద ముకుందా 93

పొందుగ నిన్నుంబాడుట
కుందప్పమతెట్టివృత్తి గొల్పించకు న
న్నందయతో నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 94

ఎందైన నాదుమిత్రుల
కందఱికి నీ్నదుభక్తి నలరించుము కా
ళిందీప్రియ నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 95

ఇం దారోగ్య చిరాయువు
లందించు ఽభీష్టజనము లలరగఁ దుది నీ
యందుంచుము నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 96

బృందావన సంచారా
నందయశోదాకుమార నానాశ్రిత స
న్మందారా నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 97

పొందుగ నీకీశతకము
సందర్శించుటకుకన్న సంతోషము నా
కెందుండును! నారాయణ
కందళితానందమూలకంద ముకుందా॥ 98

డెందం బదేమొ ధైర్యం
బందెను వినుఁజూడఁగలుగు నంచిప్పుడు వి
న్నందేహము నారాయణ
కందళితానందమూలకంద ముకుందా! 99

అందఱు దరియించుటకీ
కందములాచంద్రతారకంబుగ మహిలో
నందెలుపుము నారాయణ
కందళితానందమూల కందముకుందా॥ 100

శ్రీ ముకుంద శతకము సంపూర్ణము.

శ్రీరస్తు

శ్రీ ఆనందగజపతి మహారాజాజ్ఞచే

(సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్)

అను సమస్యకుం బూర్తిగా

# సత్య వ్రత శతకము

కందములు

హితమిత వాక్సంతతికిన్
ధృతభూతదయానురతికి ధైర్యోన్నతికిన్
జతురమనీషాగతికిన్
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 1

గతకిల్బిష వ్రతతతికిన్
జ్యుతదుర్జన సంగతికిని సూనృతమతికిన్
శ్రితరక్షణానురతికిన్
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్ 2

స్తుతిదగు ధర్మనిరతికిన్
స్వతంత్ర సంచారధీర వసుధాపతికిన్
బ్రతుకేల యనృతమతికిన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 3

అతుకు బ్రతు కనృతమతికిన్
స్వతంత్ర పరిజీవనంబు శౌర్యస్థితికిన్
బతిపరిచర్యలు సతికిన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 4

వితథంబౌను గుమతికిన్
బ్రతిపక్షులనైన విజమువచ్చు సుమతికిన్
బ్రతిభయగుస్స్వైరధృతికిన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్॥ 5

సతత తపస్స్వాధ్యాయని
యతయోగనిలబ్ధశమద మాదిలసత్సూ
నృతవాదన ప్రకృతికిన్
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 6

శ్రితజనపోషణ నిపుణా
ప్రతిమదయాశౌర్యధైర్య వైభవభర్మాం
చితమణి సూనృతమతికిన్
సతతము సంతసమొసంగు సత్య వతికిన్॥ 7

కౌతు కతుకు బితుకెఱుంగని సు
మతికిన్సర్వోపకృతికి మానితగుణ సం
తతికిన్ సుకృతవసతికిన్
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 8

అతుల ధనాఢ్యునికన్నన్
శ్రుతిస్మృతి విచారచతుర సూరులకన్నన్
బ్రతుకుమతెవ్వనికన్నన్
సతతము సంతస మొసంగు సత్య వతికిన్॥ 9

సతిసుతులం బాసియైనం
బ్రతిపక్షులు దనకునెట్టి బాధలనిడినన్
బ్రతుకున నేదెట్లైనన్
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 10

క్షితిలోఁగూటికిగుడ్డకు
గతిలేకుండియును నెట్టి కష్టములైనన్
ధృతినిసుమంతయుఁజెదరక
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 11

అతి మోహమున హఠాత్తుగ
క్షితిధనపతి కూతుఁరొకతె చేపట్టిన య
ష్ఠ తిరిపగాని మనంబటు
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 12

ప్రతిబలములతో నోడలు
ప్రతికూలానిలముచేత వార్ధిమునుంగన్
మతిచెడనితటస్థునివలె
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్ ॥ 13

క్షితిని హఠాత్తువిదేశ
స్థితుఁడై గతి తెలియఁబోని చెల్వేఁడురాఁగన్
మతినలరు పతివ్రతికటు
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 14

బ్రతుకునసుంకం బెఱుఁగక
స్వతంత్రరాజ్యంబుచేయు ప్రభువలెనుబతి
వ్రతవలె సహజకవివలెన్
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 15

చితికినయద్దంబట్టుకు
మతివార్తక మెపుడు పెక్కు మాయలఁజూపన్
క్షితినది స్పష్టముగాఁగన్
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 16

అతగునకు దిగంతము రే
ఖతీరునన్నిజముదోఁచి గారడిచేయన్
మతినది గుర్తిఁపఁజాలిన
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 17

క్షితినడుగంటియు వాస్తవ
గతి పలువురు నడచుదారి గతికవలె న్నా
శతపొందక తలచూపన్
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 18

బ్రతికినవఱకున్సర్పము
గతివిషముటుకల్ల వెడలఁగ్రక్కుచు నిజమన్
రతనముఁదాఁచు కుమతిచెడ
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 19

క్షితికోదబ్బటి తేఁలాౖ
ఋతీయనందోఁచకయుఁగడుంబాధింపన్
మతిఁగోర్పుమంత్ర మహిమని
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 20

ఆతగునకుఁబుండు పొడమిన
గతినన్నృతముతోఁచి నాభి గడచి హృదయమున్
గుతుకియుఁ గొఱుకక చసదన
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 21

అతుకుడు దబ్బఱలల్లుచుఁ
గొతుకుచుబల్కొంచెమారి కొఱికిన చెవితో
మతిచెడును మంచివాఁడున్
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 22

సతము దనగుట్టు దెల్పక
నృతవాదముతోడ దుష్ట నీతి జరఁగునా
మతకరివినిగిడి చెడిపడన్
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 23

క్షితినోర్వలేమి పాము వి
రతమును సూనృతముపాలు దాివియు విషరూ
పతఁగల్లిఁబంట నొసఁగన్
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్ 24

అతుకుమెతుకు కతుకుకొమచు
బ్రతుకు పరాధీనమయ్యు బలుగోఁటునసూ
నృతమనని పంద చెడఁగా
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్ 25

క్షితివిజము ప్రొద్దు మహిమల
నతికపటి యెఱుంగు పెటు ది వాంఛమువలెస
మ్మతివావికళక్యంబన
సతతము సంతస మెసంగు పత్యవ్రతికిన్ 26

మృతియొండెలేక నాల్కుక
నృతమొండెను రామబలి హరిశ్చంద్రులటుల్
బ్రతుకఁదలంచిన సుకృతికి
సతతము సంతసమెసంగు పత్యవ్రతికిన్॥ 27

మృతిరానీ నాతవికిని
జితిఁజొచ్చెదవిప్రయట్లు నేయమిననుమా
నృతపరనర ప్రకృతికిన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 28

మతకరి న్యాయవివాదుల
బ్రతుకులకై ధర్మపథలఁ బడియేనుఁగుగ్రు
ద్దిశదపుటవలె నిజముగన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్ 29

ప్రతివాదియు వాదియు నిజ
ముతేల్చఁతగపద్దు నెఱవు మొఱయిడువత్తల్
గతికిన పద్ధతులనఁగా
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్ 30

గతిమాలినదవి రెంచవ
మతిమాలిన పక్షకుఁద్రిప్ప మాటయుఁదప్పన్
విశగామూఁటి నిజముతెగ
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 31

ఇతరుల సాక్ష్యము తనకెటు
జతబడుఁ దననాల్కె నిజము జరుపక యున్నన్
దతదంభ సభాస్థితికిన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 32

అతిరభసస్థితితోఁ గొం
దత్రిప్పి చుంచెలుకఁ బట్టి డాఁబునసత్య
స్థితివేదలు ధర్మసభనన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్ 33

క్షితి కంటకయెరసముప్రాఁ
కుతెన్నునన్నిజముతోఁచి కుత్సితలోకం
బు తగిలియుఁ డగులక చనన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 34

అతగున కుబ్బు పొసంగున్
మతకరి తుదఁ దసదు ధనము మాయి కొసఁగున్
మృతి జ్ఞాఁడును దొసంగున్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 35

పతియెడ మోసము గొల్పుచు
నతినిపుణతఁగల్లమాట లాడు కులటకున్
మితిమీఱునిందెరాఁగన్
సతతము సతంసమెసంగు సత్యవ్రతికిన్॥ 30

మితిరేపు రే పనుచు నా
డితప్పనను చేండ్లు త్రిప్పి డిల్లవడి తుదన్
వితఁజూపుదబ్బతి చెడన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 37

క్రతువు మిషవెట్టి ధనముల
నతినిపుణతఁ జెనటి కూర్చి యాలికి నగలన్
మితి మీఱఁబెట్టి పొలియఁగ
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 38

ఉతికిన దుప్పటితీరున
మతిశుద్ధతచెందుఁ జాటు మాటు తొలఁగినన్
ధృతివంతునకది తెలిసిన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 39

చతురముగ నన్నృతకల్పనఁ
బ్రతిదినమున్నేయు దొంగ బ్రతుకుటకన్నన్
మృతిచెందుట సార్థకమౌ
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 40

మతిలో హాలాహలము న
మృతముం బుక్కిటను గల్గి మెలఁగెడు నీచుం
డతిదుర్గతికిం బాల్పడ
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 41

యతివేషమ్మంగైకొని
మతిహీనులఁ బెదరఁగొట్టి మాటున దంభుం
డతిభోగములఁ గ్రహింపగ
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 42

అతిజార విసుగుఁబతికిన్
మతిహీనుఁడు ధనములొసఁగు మఱితిరుపతికిన్
స్తుతిపొసఁగు జగత్పతికిన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 43

క్షితిలోఁగొండె మలఁతికిన్
మతిలో ధైర్యంబుపూత మానుషసతికిన్
వితయగు బ్రతుకు కుమతికిన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 44

కతికిన బానిస మెతుకులు
బ్రతుకులు స్నేహంబుపట్ల బల్కులు కొతుకుల్
ముతకనగు చూడ్కులంటక
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 45

క్షతమువలె దేహాకిం దను
వ్రతగులఁదొలిసందెయట్లపో పడుచుతనం
బతిలాపము చదువనఁగా
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్ 46

పతగములు సంజమింటం
బ్రతుకునకై కదలిం ట్టు మాశ్రికులపోలిక
గొతికెడు లంచ మెఱుంగవన
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 47

అతుల వికారము కీడు మ
నృతవాదికి శక్తిహీన నీచకుమతికిన్
క్షితిసూనృతు నెడ సొగసది
సతతము సంతస మెసంగు సత్య వ్రతికిన్ 48

జత మోద్పదో సిళల్వ
ద్వైతన్కు బలుకల్ల పలుక దిరిపెపుటక్కుల్
క్షితిలుద్ధత్వ మనృతునికి
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 49

ధృతి చెడకయుంట కవికర
మతికినమనసుంట స్వైర మౌ గతియుంటన్
క్షితిలో సూనృతమతికిన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 50

బ్రతుకున సింహాకృతికా
యతమంజుల సూనృతవచ నాధికధృతికిన్
హతదీ నార్తికి సుకృతికి
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 51

బ్రతుకుపకృతి సలుపుట సూ
నృతమునకు ఫలంబు మంచి పేర్పు దెలుపుటల్
జతపడు సుస్థిరధృతికిన్
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 52

గతము తలంచి వెక్కుచుంగడు
జతురము గాఁ దనదుడాలు చాటుచుంగల్లల్
మితిమిగులంబల్కు చెదుగన
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్ ॥ 53

ఆతుకుడు సంపద గుసుపు ల
ఇంతివానికి వలపుతేంట లగ్గు చెసంటికిన్
గొతుకుడు దబ్బతికెగ్గన
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 54

క్షితిబచ్చి తోరణము నా
తతకల్యాణంబు న నృత దంపతులకుంబ
ద్ధతిపు ప్రైముడియు వృధయన
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 55

ఆతుకుడు కాగితములు జీ
వితవిరహితమిక్కలంబు వెంట్రుకతత్పూ
స్మృతి గతిని దెలుప లేవన
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 56

మతికిందెలి పెడివా స్త
వ్యత శాస్త్రమ సంగ మనుజు నందెపొడము నై
జతగుణు తది కృత్రిమమన
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 57

క్షితియెక్కడ? దివ్యగ్రహ
తతియెక్కడ? నక్క దేవ తలమటు లన్నృత
స్థితి జూపు నరుసకోల తగ
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 58

అతిప్రాచీన పురాణము
లితిహాసంబులు చరిత్ర లిల నమ్మమి సూ
నృతమెటు పౌత్త్రములం దన
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 59

అతిచంచల మవిదిత చి
త్తతత్వముం దెలుపగల్పిం పు వ్రాంతలసూ
నృతమెటు శంకల తెగవన
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 60

గతము నిరూపింపగ వి
స్మృతి ప్రకృత మెఱుంగం జపని వృత్తుభవిష్య
త్తుతలంప నిశ్చయమెట్లన
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 61

క్షితిఁజాటుపుండు మామక
యి తెడుమువైద్యుంబ నాంగ నిచ్చదెలుపు సూ
నృతిమె టులజ్జామతిఁ న
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 62

క్షితిలో దివ్యప్రకృతి గ
ణుతింపమ్మద్రూపులగు మనుజుల కెటులగున్
వితథము నరశాస్త్రంబన
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 63

మితిమిగిలి గొద్దుమెసఁగున్
అతిలోభిమొగమున వెలితి హాస్యముపొసఁగున్
బ్రతుకున దబ్బఱి దొసఁగున్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 64

అతిసహవాసము గలుగక
క్షితిమిక్కిలి ననుభవంబు చెందక వస్తు
స్థితి నొరుని దెలియరాదన
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 65

క్షితిఁదనతాత్పర్యముతో
వితరుల భేదింపఁ గొఱకె యే యని దన సం
గతి దేవుడెఱుఁగనీ యన
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 66

క్షితి ననుమానము బిక్కె
క్షితయుఁబ్రమాణంబు తెలుపఁ జాలడువా స్త
వ్యతమిగులు బ్రహ్మమటులన
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 67

క్షితిఁవన్నెవ్వరుకనిరో
గతి తెలియఁడు బ్రద్దినమ్మకము గొనకున్నన్
మతినొరునిజమెటు కనునన
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 68

అతుకుడుకూడు కుమతికిన్
బతివ్రతాతత్వమార్య వంశయువతికిన్
అతిశమము సహజధృతికిన్
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్ 69

క్షితిదివ్యతత్వమగు సూ
నృతితత్వమఖిలేశు కరుణ నెనయకయున్నన్
అతిగానెక్కెన రాదన
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 70

క్షితిలో న (గుత్సితుఁ డు సూ
నృతమనశక్యంబుగా వ దేహేతువా వా
రితలలు తగవు నిరూఢిగ
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్ 71

కృతయుగమనఁ గలియన సూ
నృతానృతముఁ బిక్కె నేక విశ్వాసమునం
జతపడుఁ గాలస్థితికన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 72

అతిలాప మశక్తియు దు
ర్మతిత్వముం గ్రూరచర్య మాయయు సనృతం
బు తెవులుగల నరుగుణ మన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 73

ప్రతికూల మనఁడు చెల్లియు
నతిక్రమము సేయఁ బోవఁ డాశ్రిత దాక్షి
ణ్యతఁ జూపు సుకృతినాఁగన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్ 74

వితతానందకరము సూ
నృతమెల్లెడ మెప్పుదెచ్చి నిజముగనదియీ
క్షితినరు విలువ దెలుపునన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 75

క్షితినెల్ల దానఫలములు
నతులితమఖయోగ జప త పోతిశయము సూ
నృతమహిమకు సరికావన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 76

క్షితిపతులయొద్దఁ గొంచెము
శ్రితకుముఁ బనమోక్షకేమి నస్మృత మనెడు దు
ర్మతి నిందించఁబడి చెడనన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 77

అతిథికి లోభివౌనఁగున్
అతిమాత్రమువాఁగ సోమ దియ్యమెసంగున్
స్తుతి నిజమునకుఁ బొసంగున్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్ 78

అతికిన బూడిదపట్టెలు
నుతికిన మడిపొత్తు పంచె లురవడిమున్కల్
క్షితిసూన్యజమున నావన
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్॥ 79

క్షితి నానందమయాము సూ
నృతమది వివరించి వ్రాయుటెటులో! నిక్క
ల్పితకవిత నిజ మెఱుంగదన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 80

క్షితిఁగల్లకూట సాక్షులు
గుతర్క నాస్తికులు భ్రష్ట కుంఖిఖరులున్
జతపడ వాన గుఱియదన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 81

పతిభక్తి దేవభక్తియు
గతికోలఁదిగ దానశక్తి కరుణామతి సూ
నృతమంటనిచోఁ గఱవన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 82

క్షితిలో సోమరిపందకు
స్వతంత్రలౌకిక సుఖంబు ్మకూరమి సూ
నృతమైనఁ బౌరుషంబిడు
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 83

క్షితినూతఁబడ్డ కుక్కటు
లతగుఁడు దన్నుద్ధరించు సతినికె కీడుం
జతపర్చి దుర్గతింజన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్ 84

వితవిందు రోగగతికిన్
వెత పడుచును బోల్డియాడు వెకుముదిపతికిన్
సతమనృతము దుర్మతికిన్
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 85

క్షితిఁగొంటె పొగత్త చమ
త్కృతికల్పన లిచ్ఛకములు గేరడములు గ
ల్లతనమునకుఁ బిల్లలన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 86

క్షితి దాతృత్వము సత్సం
గతిత్వ మౌదార్య శౌర్య గాంభీర్యంబుల్
దతకరుణా సూనృతములు
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 87

అతికష్టమయ్యుఁ జేరువ
గతివింటికి వెదకు పాంధుకై వడిగా సూ
నృతమార్గ మెఱిఁగినడిచిన
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 88

క్షితిలోఁ బాపము పుణ్యము
హితప్రియత్వంబు సంత తానందంబున్
మృతి శాశ్వతత్వ మనఁగా
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్। 89

అతిరతి వాంఛకుమితికిం
బ్రతిమర్కటచేష్ట నీచ మనుజాకృతికిన్
బ్రతుకువృధ లోలరతికిన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్। 90

ఆతుకొక్కెడ బితుకొక్కెడ
బ్రతుకొక్కెడఁ దెలియలేక వశుఁడై కృశుఁడై
ధృతిదప్పఁ గల్లవో తన
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్। 91

క్షితినిచ్చిన విచ్చువిధయుఁ
బతియగుటకుఁ గారణంబు పరుగుట స్పష్టం
బు తిరిపగాఁడే లోభిగ
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 92

బ్రతుకునఁ గృత్యాగృత్యము
లు తలఁపఁబో కొరల బాధ లుసలుపునరులన్
మృతులనుచు వారివి విడిచి
సతతము సతంసమెసంగు సత్యవ్రతికిన్। 93

అతగునికంటక వాస్త
వ్యతదోబాచులను బుష్య ఖానువిమాడ్కిన్
మతిభ్రమపెట్టి వెలుగునన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్। 94

క్షితినాత్మ భటులుమాటలఁ
మతికోటంబయలుదేఱి మఱిహాతెఱుఁ
ల్పోతిగిలి పతివెలఁ దెల్పఁగ
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 95

క్షితిఁబుట్టియేడ్పు పుదిటి చి
రత పెద్దలకన్న మేలు రో గాన్నృతమిం
కఁ దగులు దశకు నడరదన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 96

మతదంభముతోఁ బక్రాం
కితముల కాల్పులను హోమ కృతపశుకోటుల్
క్షితిసూనృతఫల మొసగవు
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 97

క్షితిలో సూనృత తత్వము
మతి నెఱిఁగి నుతించి నడుపు మాన్యులకున్నం
తతజీవనము క్తియనన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్॥ 98

బ్రతుకునఁ జదువులు సందెలు
జతురకళా విపుణతయును సర్వప్రజ్ఞల్
వితసూనృతమాడవిచో
సతతము సంతసమొసంగు సత్య వతికిన్॥ 99

చతురకళా విద్యాసం
గతికిన్ స్థిరధృతికిఁ బ్రకట కరుణామతి కి
కృతి యానందగజపతికి
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్॥ 100

సత్యవ్రత శతకము సంపూర్ణము.

# మట్టు

ఇట్టివట్టున్గొనియాడవి నాలిక చింకిపాఁతపీలిక, కంబమయ్య పేయఁబ్రాయని కేలు తుక్కుకీలు, నరసింగని దలంపని యుల్లము పాడుకల్లము, కంబమురాయని తిరునాళ్ళఁగనని కన్నులు మేఁకమెడచన్నులు సింగనికి మ్రొక్కని బ్రతుకెంగిలి మెతుకు, రెంటఁబ్రాగుడు తిండిమెట్టంటుపేల్పన్గొల్వనివారు మానిసులుకారు. నిక్కమని నక్కాణించు పెద్దలమాట నమ్మికొని నావాడినమాటలు విడిచి యిట్లి పీసువలు కలప్పినమువంద నరసింగనిపై మఱిమాటలల్లువారై నఁగూర్చ సలవికాని తీరున నాయలువేల్పు నెనరుమై నేఁబన్నఁగలిగినాఁడను. నిజముగా నెద్దియోకూఁతలు న్నేమిసన్నలున్నప్పు మొట్టమొదటఁదక్కమేనితాల్పులకువలె మానిసులకుఁజూడఁ దలంపులొండొరు నెఱిఁగించుకొన జంత్రములుగాని వ్రాఁతలుగానిలేవు. ఏర్పుతోఁబుట్టునెల్లరు నేడుపుతోనే గిట్టకతప్పదు. బ్రతుకు తుదమొదళ్ళ దినుపేడ్పేయగు నెడ నద్దానినడుముకూడ సాజముగా నేడుపే కాకతీరదు. కావున మొత్తముపై నిట్టి వ్రాఁతకూఁత రకములన్నియు నెదోయేడుపులోఁ జేరినవే, కూడుకూర్కుకూటములకై యెట్టిమానిసులైనం దమతమ వాఁతచేఁతలనెట్లో వెలితిపడక వీలా, మంచిగాఁగొందఱు నెడ్డగాఁ గొందఱు న్పుట్టిపెఱిగెడువారెల్లఁ దమకోర్కులు వెలువేర్చుకొనఁజెల్లని మొల్లతెలుపుకొనుచుందురుగా, నిజముగా నెవ్వరైన నేద్వక తీరదు మఱేడ్చిన లాబములేదు, కోరుకొన్నట్లు జరుగదుకాని కోర్కెలన్గొనసాగించుకొనుటకై యెట్లో దేవులాడకతప్పదు, కసింతయున్ముందుకాఁజోవుపని నెఱుఁగఁ దరముకాదు, తమంతఁదామెట్లో జరుగు మంచిచెడ్డలెంతవారేనిఁ గుడువకతప్పదు, చావకతీరవి గూనివంపులాగున్నదబ్బాయీ మానిసిబ్రతుకు, నిక్కముగా నందఱికన్న నెక్కువగా నుండవలెననియుఁ దాదలంచిన పెల్లపనులు జరుగవలయునని నెడుగొంతెమకోరిక మానిసికిఁబుట్టుతెగులు, బాపఁడు దొర కోమటికాఁపనెడు నాల్గుకొలముల కట్టుపాటువలె వాఁతవ్రాఁతచేతల పడికట్లన్నియు న్నూటికొకవంతు వెఱ్ఱివాండ్రచేత నక్కిన తొంబదితొమ్మిదిపాళ్ళు మోసకాండ్రచేతన్దప్ప తేర్పడినవని కొంతయైనఁ

దెల్వితేటలు కలవారొప్పుకొనకతప్పునా, కూడుకూర్కు కూటములతోడనే తక్కు
మేని తాలుపులమాత్కెఁదనివి పొందక లేనిపోని చేఁతకాని పనువులకై తంటాలు
వడుచూరకు బసపోని మంగలిపిల్లితల గొలుగునట్టియా సాళ్ళముచ్చట మిటికిబ్రతు
కెల్లెనిఁగడుపని యేలాయియైననేమి పంక్తూ డంగొట్టుకొనుట కనితెలిసీతెలియక పిన్న
యైన నేమి పెద్దయైన నేమి పేదయైననేమి దొరయైననేమి కోరికోరిచెడుచున్నారాహా
పుట్టుక చావులాఁకలిదప్పికలు మేల్కొడులు హెచ్చుతగ్గులు రేపుమాపులుక్రింద మీఁదు
లందరికొక్కటేకదా, యింతకుమ్మిన మెఱుఁగఁదరముకాక వాగియున్న వేల్పుదిన
పేదియో మనమనకొన్న మంచిపెద్దరలకుఁ దల్లివేరని తెలియఁజాలక పెద్దకుండల
కెనళ్ళ పెట్టుచు నందరానిపండ్లకట్టు చాఁపుచుఁ దుడకొకరొకరిఁదూలవాఁడి తన్ను
కొనుచు వలపుపగ పిసివారితనము తగులు పొగరుమచ్చరములన్నిక్కి యయ్యోనాకొరి
నట్లు బ్రతుకఁజాలనైతినని యేడ్చుచున్పొలియునంత యెల్లప్పుడున్దనతోడి వారికి
మేలేకోరెడు నెవ్వరికోగాని ముప్పొద్దునన్వేల్పు నేనమ్మికొల్చు నతఁడెయొంటికాం
డ్రకోకాని దప్పదుగా తమతోడివారలనెల్ల తెలుంగు లన్నొప్పించి తామొక్కరే
పెచ్చుకుడిచి తెగఁగ్రొవ్వి విఱ్ఱవీఁగి బలిమినణఁగారు తిప్పకాయలే మొత్తముపై
మానిసులలో నెన్నఁడైన నేలయందంతటన్గనుపట్టుచుండురని ఓరుకుపర్చుట యొక
పొరపాటు కానేరదు. ఔరా కూటికొఱకే కోటిపిద్దెలు, తమచేతికిలొంగిన పనులమెద
మలిమిచంపు తూళజన్నములంట పదునాఱుసుద్ది వేదబములంట పదునెనిమిది విద్దె
లట, యఱువదినాలుగు పిచ్చినేర్పులంట, యేన్నో దొంగవానివరుసలంట, యాస్తి
యిస్తువులంట, కొలముంట: మడితడులంట, నోములంట, వస్తులంట, చదువు
సందెలంట, లెక్కలేని కొద్దిగొప్పతరముపరువులంట, మేల్కొడులంట, యేమీపొట్టక
కూర్కెత్తి యొకరుచెడవలె దా బాగుపడవలె, నెందఱున్నోయేయనలేదా నొక్కఁడే కొరి
నన్నెల్ల బ్రతుకవలె; నని యతియాసన్వేగు నబ్బెఱఁడోహో, వెఱ్ఱిపెండ్లాముపకే తక్కి
నయిల్లాంద్రకిన్ని [illegible] తెగేసు సామెతఁ దాక్కిణము కాక
మానఁడు తనతోడియం దతితోఁగూడు పంచుకొని తినుచు నెల్లవారికిన్మంచి గావడుచు
కొనుచుఁదక్కినవారికన్న నెందులోనైన నం దనయొక్కవన్నాటుకొనకే యునుఱులన్నై

వన్నొప్పింప, కెల్లరికిన్నేర్తురే చేయఁదలఁకొనుచుఁ గలనైన నగ్గలిచ్చకములాడక, మోసమొల్లక, నేలన్దున్నుకొని పండించుకొనుట తప్ప మఱేపనిమీఁదనైన బ్రతుక నెంచ, కెల్లతెలుంగుల పిరుగుపొరుగొలకు న్దోడ్పడుచుఁ, గొంచెన్నాఁడున్దినక, మంచి నీళ్ళుతప్ప మఱేవెఱ్ఱి నీళ్ళేవిన్దాగివకొ, కయ్యాలనేపెంచుకొని పాడిఁజెడుచుచు, నాయా తెగలవారెక్కటిగాఁ బదిండ్లకుమించి యెడముగా నాయాయూళ్ళఁగట్టుకొన, కెయేకాల ములవా రాయాకాలములతోనే పెద్దలుచెప్పిన చొప్పున నీదుజోడు జతపడుతెన్నునఁ బెండ్లిజరుపుకొనుచు, సేద్యము, వెజ్జుతీకము, కూళమెకముల న్వేఁటాడుటయు, నీమూఁదుపనులుతప్ప, మఱేలేనిపోని యక్కఱమాలిన వ్రాఁతకూఁతచదువుసందెల జోలియు న్దలపెట్టకొంకమందుకొతెకే వెజ్జుచెప్పినచొప్పున మత్తుచిలు మదినుసులు వాడుకొనుచుఁ, దమ్మకొపాడుట కై వేల్పున్మ్రొవ్వద్దు లన్వేడుకొనుచు, మాఱు కోరిన యాటపాటమాటమీటల, నొండొరులకు వేడ్కఁగావించుకొనువారిన్దప్పక, కం బమయ్యే యిక్కట్టులన్ని యున్దప్పించి, కోరినన్నేండ్లు హాయిగా మన్నింపకమానఁడు, వ్రాఁత మొదలగు జంత్రములవలన నోటిపల్కుల న్మొట్టమొదటి పెద్దలు వెల్లడించు కుంటకుఁ గత, మాయాకుత్తుకల రవళివడి సొగసులుచెడి, చెవులకు వెగటుపుట్టించు ననియును, వ్రాఁత మొదలగు మూఁగజంత్రముల పలుకుబడికి! లేనిపోని వెఱ్ఱిమొఱ్ఱి వివరములు పుట్టించి, వేల్పుమీఁద నమ్మికన్జెదరఁగొట్టి, యరమఱలెన్నించి, యొండొ రులకన్నాబడుసల్పి, కొలము మరియాదలన్మంటగలిపి, లాఁతులకులొంగియైన, నెట్లో పసువుమాలి, సిగ్గెడసి, యొకరికన్న నొకరెక్కుడు వారమనుకొని తెగనీల్గుచు, లం చములుబ్బర సొమ్ములన్మెక్కి యద్దిద్దముగాఁదేరగాఁ దిని క్రొవ్వెక్కి సోమరిపోతు లయి, యెల్లబోగముల నొండొరులన్మించి పిల్లవిఁగుచుఁ దమలోఁదమకేసరివడ, కొక రినొకరు మాపుకొనుచుఁ గ్రిందుమీఁదునకు రెంటికిన్జెడి, బలిమింగోరి దబ్బునమడి యుదురని నిజమెఱుఁగుటయే, గాసురాపీనాటికచ్చితెఱఁ, గఁదులోనెన్ని కగాలాఁతి నడి జోలికాసంతయున్లేని యీసీమపలుకిప్పుడు పంటకు పెచ్చెన్గావున, నేలయందెల్ల వాడుకొనంబడు నెల్లమాటలతో నెద్దాని కలుపొక్కింతయులే, కెక్కటిగా, నేయెరుపు రంగైన నంటింపకొనకే పెరనాడవుచుండి యైనఁబొదుమక, తల్లితల్లిపలె, నెల్లపలు

ఫలమిన్నయై, వెలయుచుంట, నీతేనెతీయని విలాతితెలుఁగు నెప్పినాచేఁతనైన కొలంది, వీనిట్టపుట్టు వేల్పువంద, న్నాషించిచదువరులెల్ల,, నాయల్లి నయూస్పీపషుల కొనయడుగులద్దలించియైనఁ దమపుట్టువీడేర్చుకొనఁ గలుగుదురని. యెంచువారలన్మ న్నించి, నాయిలువేల్పు కాపాడుఁగాక. ఈవేల్పువంధయందలి మాఱుమూలపలుకుల కీపొత్తము కొనవ్వివరము తెల్పినాఁడను.

అజ్జాడాదిభట్ల నారాయణదాసుఁడు.

విజయనగరముదొఁ పాటబడి పెద్ద.

# వేల్పువంద

సీ॥ ఏమందు నన్నన్న యీవృగా కెవ్వఁడునామొఱలవిని నన్గవ గలఁడు
నీకుఁదప్ప ఁజెవ్వనికయినఁదరముకాదెందేవినాకోర్కెఁబొఁదునల్పు
నేల నాకీసిగ్గుమాలిన బ్రతుకు విన్నాబదగన కీవెత్తి హూడుపెట్టు
నేమఁడిసి కొలందిన్నమ్మరంబుగ నావక్కరావివంత పెనఁగొవియె॥

వింగినేలల యందెల్ల విండుపిల్వ కిలిమిచెలికొల్ప జాఱవావఁజవతాల్ప
కవికరంబున ననుగావ నెవరుపిల్వ రెంటత్రాగుడుతిండి మెట్టంటువేల్పు॥ 1

సీ॥ తొలుచదువులె విన్ను దెలియక మళ్ళనాటుమాటలవినున్నాటఁదరమ
యక్కటా యేల బయ్యార మందిడితి విన్నరయలేకిట్లసియాడుచుంటి
దొరకిదొరకక దాఁగురుమూఁతలాడెదోవంతొకో నీకన్న పట్టిమీఁద
కోరిక వెలిపుచ్చనేరవి యడియరి తోడనీకిట్లు కండువలు తగున॥

ఏమియనఁగలనికఁ కనుత్తమేడ్పుతప్ప నేరమెన్నకు నీకు జోహారొనర్తు
దొడ్డవఁమురితాల్ప పెంద్రోవపిల్వ రెంటత్రాగుడుతిండిమెట్టంటువేల్పు॥ 2

సీ॥ వీనులు లేకీవువినెదు కన్నులులేక కనెదు చెరమలేక గబ్బరయుదు
కయిలేక పనులెల్లఁ గావించెదవు నాల్కలేక చవిగొనెదవా కయువడి
మెయిలేక బ్రదికె దిమ్మెయి నప్పసమువింగినేలలనీవు కావిదినుపేది
నీయాటకై నాకు నెగులిడ్డునీకిదే పాటి నన్గాచుటే పాటినీకు॥

ఇంక నేఁదాళఁజాల నన్నేలుకొమ్మ వెంటనే కావిపించువవ్వించునన్ను
నడ్లుతొలఁగించునాపసవట్టెవిసుము రెంటత్రాగుడుతిండిమెట్టంటువేల్పు॥ 3

సీ॥ మోపితి నాయెపు నీపయి నీవుమేలే సల్పెదంచు నేనెఱుగలేక
నేర్చి యున్నేరక నేనూరకే కోరికోరి యూచిక్కు తగుల్పుకొంటిఁ
దలిదండ్రులెఱుకవగలగొప్పవారుచెప్పినమాటవినఁబోక చెనఁటినైతిఁ
దెలిసినయట్లునేఁ దెగనీల్గినన్ను నేఁబొగడుకొనుచులాఁతిదెగడుచుంటి॥

మానలేకుంటివిటుసిగ్గుమాలి పేగికూడుకూటమిదబ్బుకకూర్తి గొంటి
నెట్టులేలెదొనన్ను గైపట్టి వడిగ రెంటత్రాగుడు తిండిమెట్టంటువేల్పు॥ 4

సీ॥ నీయెఱుఁగని దెద్దియేనిలేదైన నాగోడవష తెవనితో నుడువుకొందుఁ
గనుక నాబ్రతుకునఁ గలిగిన వింతలు తెలిసినకొలఁదినేఁదెల్పు కొనెద
నయిదేండ్ల బుడుతఁడనై యున్న మొదలునన్గోరిచదువులెల్లఁ దారసిల్లె
నీకూర్మి పెంపున నేనులియన్లాఁతి సరకుగొనక హాయిజరుగుచుంటి॥

తక్కనే నాల్లపంటలు న్దనివిమీఱ నాడిపాడుచు నిన్ను నేవేడనిమ్మ
యీవుగాకీవెలితిదీర్చు నెవ్వఁడింక రెంటత్రాగుడుతిండిమెట్టంటువేల్పు॥ 5

సీ॥ ఆఱవయేట విన్నరయు వెరవుతెల్పువైచిరి కన్నవారొప్పచనాకు
నానాటినుండి నేనాడుచుం బాడుచునీపేరు చాటుచుంటి నలుకొనల
నీవఱకున్నావియిఁకమీఁద హాయిగాఁబొడగించు నాబ్రతుకడిగినట్లు
కోరుకొన్నటునిన్నుఁ గొండాడుమై బింకముద్దెల్వితేటలఁబొనఁగవిమ్మ॥

ఎల్లతఱులందునాయాద విరవుకొనుమ యెన్న నీనింగినేలల న్నిన్నుమాడ్కి
గడలిపడమటఁ బంటల తడినెసంగు రెంటత్రాగుడుతిండిమెట్టంటువేల్పు॥ 6

సీ॥ ఎఱిఁగినవాని యశ్లేను దలకుమించినట్టి పల్కుల విట్టులల్లుచుంటి
నేనెందుకు స్పవిక్కరానని తెలిసియుం బేరితవెలకె సర్పెట్టుచుంటి
చెలరేఁగి మేలు వచ్చినవట్లనాగొప్ప వెలిపుచ్చుచున్ విఱ్ఱవీఁగుచుంటి
కోరితీఁపురముఁలకొలఁది మీఱుచుసల్పియైపునీనె త్తిపై మోపుచుంటి॥

ఇరుగుపొరుగుల యొప్పమినెంచకుంటిఁ గొంచెవయ్యుఁ దగవరిలాగు
మనుచుంటి
నీవ్వదక్కనన్గాచువాఁడెవ్వఁడౌర రెంటత్రాగుడు తిండిమెట్టంటువేల్పు॥ 7

సీ॥ ఎలనాఁగమీఁదనే యెప్పట్లనాకన్ను పైవారియిడుమనాబ్రతుకుబాన్న
కొంకక తినితాగిక్రొవ్వట నావనియేల్కలతోడ నాకెందు ననవి
వనునేఁబొగడుకొంటనాపుట్టువు తెగులులాఁతిగొప్పకునాతలంపురగులు
నెల్లరికన్న నేనే యెక్కువనుకొందునే సిగ్గెడసి తెగనీల్గుచుందు

ముదిసినకొలందిఁగొడవలన్మగ్గుచుంటి నెందుకున్పనిక్కరాక యేవిట్టులుంటి
తెమలనీతగులమిఁకవలమురితాల్ప రెంటత్రాగుడుతిండిమెట్టంటువేల్పు॥ 8

